# పరిచయం చేసిన పుస్తకాలు



రచయిత:
ఎన్. ఆర్. చందూర్

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# మనవి

కథావీథి, మారి పత్రికలలో ప్రతి నెలా ఒక మంచి పుస్తకం పరిచయంచేస్తూ వచ్చాను. ఆ పరిచయాలన్నిటి నీ పుస్తకరూపంలో వెలుపరించమని కొందరు మిత్రులు కోరారు. అన్నీ కాకపోయినా కొన్ని వున్నాయి యిందులో

— చందూర్

# విషయసూచిక

# పరిచయం చేసిన పుస్తకాలు

1. పెర్ల్ బక్: ది గిఫ్ట్ ఆఫ్ లైఫ్ (పూజాప్రసూనం)
2. సింక్లయిర్ లూయిస్: కింగ్స్ బ్లడ్ రాయల్ (రాజరక్తం)
3. రాబర్ట్ స్టాండిష్: జెంటిల్‌మన్ ఆఫ్ చైనా (తూర్పు పడమరలు)
4. శరత్ శ్రీకాంత్
5. అప్టన్ సింక్లయిర్: డ్రాగన్ హార్వెస్ట్ (లాసీ)
6. లాషా: రిక్షాబాయ్ (సుఖజీవి)
7. జాన్ లాడ్ విక్: సమ్ థింగ్ యిన్ ది హార్ట్ (హృది లేదేదో)
8. భవానీ భట్టాచార్య: సో మెనీ హంగర్స్ (పేదల ప్రయాస)
9. సోమర్సెట్ మామ్: దెన్ అండ్ నౌ (నాడు–నేడు)
10. రిచర్డ్ లావిలాన్: హౌ గ్రీన్ వజ్ మై వాలీ (రావు - తిరిగి రావు)

# పూజా ప్రసూనం

లెక్కలేనన్ని అవకాశాలువున్న దేశం అమెరికా. 46 ఏళ్ళు వచ్చేదాకా పుస్తక రచన అంటే ఏమిటో తెలియని వ్యక్తి, బ్యాంకరు ఉద్యోగానికి తిలోదకాలు వొదిలి, రచయితగా రాణించాలని కృషిచేసి సఫలత పొందగలగడం ఒక్క అమెరికాలోనే జరుగుతుంది. అమెరికా మీద రాజకీయంగా ఎన్ని ఆరోపణలు చేసినప్పటికీ ఆ దేశంలోవున్నన్ని సదవకాశాలు పృథ్విలో మరింకెక్కడా లేవని వొప్పుకోక తప్పదు. అవి అమెరికను లొక్కరికే కావచ్చు. అయితే మాత్రమేం ?

వుడ్ వర్డ్ అతి సామాన్య కుటుంబంలో అక్టోబరు 2 వ తేదీన (మన బాపూజీ జన్మదినం) పుట్టాడు; తండ్రి కార్మికుడు. చిన్నతనంలో శ్రద్ధగా చదువుకోవడంవల్ల స్కాలర్ షిప్ వొచ్చింది. సిటడల్—అంటే ఆర్మీ కాలేజీకి వెళ్ళి పట్టా పుచ్చుకున్నాడు. పట్టభద్రుడైనంత మాత్రాన ఎవరు ఉద్యోగం యిస్తారు ? యిరవయ్యోయేట విద్యాభ్యాసం పూర్తయింది. అప్పటికి వుడ్ వర్డ్ కి ఆరేళ్ళ తమ్ముడు ఉన్నాడు. యిరవయ్యేళ్ళు వొంటిమీదపడ్డ తను, తండ్రి స్వల్పసంపాదనమీద ఆధారపడటం యిష్టంలేక, ఉద్యోగం కోసం వున్నఊరు వొదిలి వెళ్ళిపోయాడు.

"ఇందులో కొత్త ఏముంది ? ప్రతివాళ్లూ చేసేపనే"— అని మీరనవచ్చు. వుడ్‌వర్డ్‌కీ మిగతావాళ్ళకీ వున్న తేడా ఒక్కటే. ప్రవాహవేగంతో కొట్టుకుపోక తన జీవితానికి ఒక ప్రత్యేకత ఏర్పరుచుకున్నాడు. 'మాకు పెళ్ళయి 33 ఏళ్ళు అయినప్పటికీ, ఈనాటికూడా నాకూ మా ఆవిడకీ తరగనన్ని ఖబుర్లుంటాయి' అంటాడు వుడ్‌వర్డ్. ఆదర్శ దాంపత్యం అంటే అలాంటి నిత్యనూతనత్వమేకదా ! వుడ్‌వర్డ్‌లా గుండెలమీద చెయ్యేసుకుని తమ భార్యలగురించి చెప్పగలిగిన మొగాళ్ళెందరున్నారీలోకంలో !

మూడోఏట వుడ్‌వర్డ్ బట్టలకి నిప్పంటుకుంటుంది. నర్సు కుశాగ్రబుద్ధివల్ల అతను కాలిపోకుండా బతుకుతాడు. ఆ సంఘటనగురించి అతనికి జ్ఞాపకమున్నదల్లా, ఒక మంట ముందు తను నుంచుని వుండటం, కాస్త పెద్దయినతర్వాత ఒకరోజున కప్పని గొయ్యితీసి పాతిపెడ్తాడు. దుర్మార్గం తల పెట్టికాదు—కప్పలు గాలివీల్చకుండా బతకగలవని ఎక్కడో పుస్తకంలో చదివాడు. తన ప్రయోగ ఫలితంకోసం ఒక రోజైనా ఆగకుండా, అయిదారు గంటలకే పూడ్చిన కప్పని బయటికి తీస్తాడు—అది గెంతుకుంటూ పారిపోతుంది. కప్పని విడుదలచెయ్యడం చూడక, పూడ్చటంమాత్రమే చూసిన పొరుగింటావిడ 'వుడ్‌వర్డ్ కప్పలపాలిట యముడు' అని నలుగురికీ చాటుతుంది. కొన్నాళ్ళుపోయాక 'వుడ్‌వర్డ్‌కి శవాలంటే యిష్టం' అని మరొక పుకారు ప్రబలుతుంది.

పలుగురాడుమాట పాటియై ధర జెల్లుతుందిగాని అది ఎల్ల వేళలా నిజం కానేరదు.

వుడ్ వర్డ్ తాత గంథర్ ఎప్పుడూ నాటకంలోని వేష ధారిమాదిరినే ప్రవర్తించేవాడు. ఏది అతని జీవనఛాయో, ఏది అతని పాత్రపోషణో తెలిసేది కాదట. తండ్రిమాత్రం 'సిరిసంపదలు యివ్వలేను సరిగదా చావుదెబ్బలు కొట్టేదా కుర్రవాణ్ణి! పెద్దయితే నామీదవున్న ఈ కొద్దిపాటి మంచి భావనకూడా పోతుంది' అనేవాడట. అంచేత, వుడ్ వర్డ్ చిన్నతనంలో ఎంత అల్లరిచేసినా, వీపు పెట్లగొట్టేందుకు ఎవరూ వుండేవారుకాదు.

పట్టభద్రుడైన తర్వాత, ముందు ఒక స్థానికపత్రికలో రిపోర్టర్ పని సంపాయిస్తాడు. వర్తకుల కమిటీ మీటింగుకి బదులు నాట్యోత్సవాలకి ప్రాముఖ్యత యివ్వడంవల్ల ఆ ఉద్యోగం ఊడుతుంది. తర్వాత అట్లాంటానగరం చేరు కుంటాడు. అక్కడ ప్రూఫ్ రీడర్ గా, అసిస్టెంట్ ఎడిటర్ గా, రకరకాల ఉద్యోగాలు చేస్తాడు. అట్లాంటాలో కూడా వుడ్ వర్డ్ కి చుక్కెదురవుతుంది. నశీబు సరిగా లేదని న్యూయా ర్క్ కి ప్రయాణం కడ్తాడు.

"నేను ఫాటలిస్ట్ని; విధిబలంముందు మానవులు తృణ ప్రాయులని నా నమ్మకం, ఈ లోకమంతా ఒక నాటకరంగం: మనమాడేది జీవితమనే నాటకం. అసలు మనం (Real Selves) ఈ భూమ్మీద కనిపించం, మనం వాట్టినీడలు

మాత్రమే. స్వయంశక్తివల్ల మనం చేస్తున్నామనుకునేది భ్రమ. రంగస్థలంమీద మన పాత్రల్ని మనం పోషిస్తున్నాం''—అంటాడు వుడ్‌వర్డ్. వెనక షేక్స్‌పియరూ ఇంచుమించు ఇలాగేఅన్నాడు: 'ఈ ప్రపంచమంతా ఒక రంగభూమి. స్త్రీ పురుషులు యావన్మందీ పాత్రధారులు. ఎవరి ప్రవేశనిష్క్రమణాలు వారికున్నాయి. ఒకే వ్యక్తి ఎన్నో పాత్రలు అభినయిస్తున్నాడు.''

దేవుడిమీద భారంవేసి మనపని మనం చేసుకుపోవాలి—అనే తత్వంగల మనిషి వుడ్‌వర్డ్, ''శక్తి అనండి, ఆత్మ అనండి—దానిలోనుంచి వస్తోంది దేహానికి ప్రాణం. మరణమనేది ఆత్మని అంటదు. దేహాన్ని విడిచిన ప్రాణం ఆత్మ రూపం పొందడమే ఫోర్త్ డైమన్‌జన్.'' ఈమాదిరి ఆలోచనాక్రమం ప్రాచ్యఖండవాసుల మేధాసంపత్తికి సన్నిహితంగా ఉంటుంది.

న్యూయార్కు మహానగరంలో అనుభవించేటంతటి ఏకాంతత ఎక్కడా ఉండదు. పెద్ద భవంతిలో అరలు అరలుగా నివాసాలు. పక్కభాగంలో ఎవరున్నారో తెలుసుకోవలసిన అగత్యం ఉండదు; తెలీనుకూడాను. అంతటి జనసంకీర్ణంలోనూ ఎవడికివాడు ఏకైకజీవి. ఆ ఏకాంతత కొందరు తట్టుకోలేరు. కాని వుడ్‌వర్డ్ జీవితానికి అది మెరుగు పెట్టింది. దాన్ని 'ప్రయివసి' అంటాడతను. మన గ్రామంలో అయితే మనంచేసే ప్రతిపనీ పక్కవాడు వెయ్యికళ్ళతో

కనిపెట్టి, ఎవరూ అడక్కుండానే తన అభిప్రాయం నలుగురికీ వెదజల్లుతారు. ఇలాంటిది చాలావాట్టుకు దుష్ప్రచారమే అవుతుంటుంది. మహాపట్నాల్లో ఆ యిబ్బంది ఉండదు.

ఆ రోజుల్లో వీల్స్ (అంటే సైకిళ్ళు) ఫేషను. వుడ్ వర్డ్ మొదటిసారి మోటారుకారుని న్యూయార్కునగరంలో ఫిఫ్త్ యెవెన్యూలో చూస్తాడు. మళ్ళీ ఒక ప్రెస్‌లో ఉద్యోగం లభిస్తుంది. బ్రష్‌లార్డ్స్ అనే ఫ్రెంచి కుటుంబంలో పేయింగ్ గెస్టుగావుండి, ఫ్రెంచి భాష అభ్యసిస్తూవుంటాడు. లూయీజా వారి కుమార్తె—వయసొచ్చిన కన్య; చిన్న కంపెనీలో పని చేస్తూవుండేది. ఆమె, వుడ్ వర్డ్ వారానికొకసారి థియేటర్‌కి వెళ్ళేవారు. ప్రతివారం ఆమె తను ఖూనీ చెయ్యదలచుకున్న మనుషులపట్టీ వుడ్ వర్డ్‌కి నివేదించేది. అందులో ఆమె పని చేసే కంపెనీ మేనేజర్లూ, హోటల్ వెయిటర్లూ, ట్రామ్ కండక్టర్లూ, యింకా చాలామంది వుండేవారు. తన అభివృద్ధికి లూయీజా విరోధకురాలు కాగలదని ఆమెని ప్రేయసిగా స్వీకరించడు—అప్పటికే కాస్త ధక్కాముక్కీలు తినివున్న వుడ్ వర్డ్.

ఆపైని వుడ్ వర్డ్ యడ్వర్టయిజింగ్ కంపెనీలో ప్రకటనలు రాసే ఉద్యోగిగా పనిచేస్తాడు. అప్పుడే అతనికి సింక్లయిర్ లూయీతో ప్రథమ పరిచయం; వుడ్ వర్డూ యింకో ఆయనా కలిసి స్థాపించిన గ్రంథసమీక్షకుల సిండికేట్‌లో వారానికి అరవైడాలర్ల ఉద్యోగానికి సింక్లయిర్ లూయీ కుదురు

లాడు. హెలెన్ను వుడ్‌వర్డ్ తన 40 వ ఏట వివాహం చేసుకుంటాడు. ఆమెకూడా యడ్వర్టయిజింగ్ కంపెనీలో పని చేస్తున్న మనిషే. ఒక రోజు మధ్యాహ్నం యిద్దరూ హోటల్లో భోంచేస్తూవుండగా వుడ్‌వర్డ్ అడుగుతాడు: 'హెలెన్, నువ్వూ నేనూ పెళ్ళిచేసుకుంటే...''

''ఓ—దానికేం! డిసెంబరుదాకా నాకు ఆఫీసులో తెమలనంత పని ఉంది. ఈ రెండు నెలలూ పోయిన తర్వాత అలాగే !''

ఇద్దరూ సుఖాన్నికాక వర్కుని ప్రేమించారు కాబట్టి 33 ఏళ్ళ అనంతరం కూడా వాళ్ళకి చెప్పుకోవలసిన సంగతులు తరగలేదు. వుడ్‌వర్డ్ యడ్వర్టయిజింగ్‌లోకి వెళ్ళాడు. 46 వ ఏట బాంకింగ్ వొదిలేసి కలం పట్టాడు.

1920 సెప్టెంబరు 17వ తేదీన వాల్‌స్ట్రీట్‌లోని సబ్‌ట్రెజరీ ముందు ఒక గుర్రపుబగ్గీ ఆగింది. ఆ బగ్గీలో ఒక డైనమైట్ ఉంది. అది అమాంతం పేలింది. 31 మంది తక్షణం మరణించారు; 125 మంది క్షతగాత్రులయారు. ఈ మహాప్రమాదానికి కారణభూతు లెవరో నాటికీ నేటికీకూడా తెలీదు. బాంబు ఒక్క త్రుటిలో పేలుతుందనగా వుడ్‌వర్డ్ ఆ బగ్గీ పక్కనుంచే వెళ్ళాడు. అరవై సెకనుల వారవల్ల తను జీవించడం విధివశం కాక మరేమిటంటాడు వుడ్‌వర్డ్.

బంక్, లాటరీ అను పేర్లుగల అతని పుస్తకాలు అమెరికాలోని పాఠకలోకం ఆదరిస్తుంది. 1925 లో భార్యాభర్త

లిక్షరూ పారిస్ వెళ్ళి ఒక ఏడాదిపాటు వుంటారక్కడ. క్రోపాట్కిన్ కుమార్తెని అక్కడ కలుసుకుంటారు. ఏభై ఏళ్ళు వచ్చేదాకా వుడ్‌వర్డ్‌ని పీడించిన మెదడుపోటు. ఏభయ్యోయేడు నుంచి మాయమవుతుంది. 19 వ శతాబ్దమే పరిశోధనల శతాబ్దమంటూ ఒక లిస్ట్ యిస్తాడు వుడ్‌వర్డ్.

| పేరు. | కనిపెట్టినవారు. | సంవత్సరం. |
|---|---|---|
| టెలిగ్రాఫ్ | మోర్స్ | 1832 |
| అగ్గిపుల్లలు | ఫిలిప్స్ | 1832 |
| వల్కనైజ్‌డ్ రబ్బర్ | గుడ్‌యియర్ | 1839 |
| ఫొటోగ్రఫి | డాగెర్రి | 1839 |
| రోటరీప్రెస్ | హో | 1842 |
| కుట్టుమిషన్ | హావ్ | 1846 |
| స్టీల్ | కెల్లి | 1857 |
| పీచుకాయితం | టిల్గ్‌మాన్ | 1866 |
| టైప్‌రైటర్ | షోల్స్ | 1876 |
| గ్రామఫోన్ | ఎడిసన్ | 1877 |
| ఎలక్ట్రిక్ దీపం | ఎడిసన్ | 1878 |
| ఫవుంటెన్ పెన్ | వాటర్‌మాన్ | 1884 |
| మోటారుకారు | డర్‌యి | 1892 |
| సినీమా | ఎడిసన్ | 1893 |

రేడియో 1902 లో, విమానం 1903 లో కనిపెట్టారు. అవును, యిన్ని కనిపెట్టారు. ఈ పరిశోధనలన్నిటి వల్లా

వారు ప్రతి సుఖపడుతున్నారా? ప్రతివాడూ తనను తాను ప్రశ్నించుకోవలసిన ప్రశ్న — ఈ జీవితానికి అర్థం ఏమిటి, ఉద్దేశం ఏమిటి? వుడ్‌వర్త్ ఈ మాటల్లో చెప్ప ప్రయత్నిస్తున్నాడు; "నాకు ఒక పిక్చర్ చూపుతున్నారు హాలీవుడ్‌లో. అందులో పాల్గొన్న నటీనటులందరూ నాకు తెలిసినవాళ్ళే. పిక్చర్ చూస్తున్నంతసేపూ వారు నాకు రెండు పరిమాణాల్లోనే—పొడవూ వెడల్పుల్లోనే—కనబడు తున్నారు. కళ్ళు మూసుకున్నా కంఠాల్ని బట్టి వారెవరో గుర్తుపట్టగలను. కాని అసలు మనుషులు అక్కడ లేరు; ఎక్కడో ఉన్నారు. అయినప్పటికీ వారు ఆ తెరమీద జీవించారు. పిక్చర్ చూస్తున్నకొద్దీ నాకదే అనిపించింది. అసలు మనం (Real Selves) ఈ భూమ్మీద కనబడం. మనకి తెలియని నిర్ణయాలకి లొంగి పనులు చేస్తూ, మనం చేస్తున్నా మనుకుంటాం."

వుడ్‌వర్థ పురుషుల కంటె స్త్రీలు ఉన్నతులు—అంటాడు. వారిలో ఆదరం ఆత్మీయత, కవనం కారుణ్యం ఉన్నాయట. ఇక కళ అనేది స్త్రీ పురుష విభేదాలకి అతీతమయినది. కనిపించి వినిపించే మాటలే కాకుండా బరువైన రహస్యాలు మోస్తుంది ఉత్తమ కళ. అచ్చయిన అక్షరాలకి మించి ఏదో చెప్పగలగాలి ప్రతిపుస్తకమూ; కాన్వాస్ మీద కని పించేదే కాకుండా మరింకేంతో చెప్పగలగాలి ప్రతి చిత్ర పటమూ; మానవాత్మనుంచి విశ్వవాణిని పలికించాలి.

వుడ్ వర్డు తను కలుసుకున్న ప్రముఖుల గురించి ఎన్నో పిట్టకథలు చెప్పాడు ఈ పుస్తకంలో. మచ్చుకి రెండు మాత్రం చెబుతాను యిక్కడ. తూర్పు పడమరలు తెలీని వెర్రిబాగుల పిల్లలు గ్లామర్ క్వీన్స్ అయి, అమెరికన్ ప్రెసిడెంటు కంటె ఎక్కువ జీతం పుచ్చుకుంటూ వుంటారు హాలీవుడ్‌లో. అలాంటి హాలీవుడ్‌లోని యమ్. జి. యమ్. వారు 1929 లో పి. జి. వుడ్ హౌస్‌ని తమ కంపెనీలో స్క్రిప్టు రాసేందుకు, వారానికి రెండువేల డాలర్ల ప్రతిఫలం మీద బుక్ చేసి, అతన్ని యింగ్లండునుంచి అమెరికాకి రప్పించారు. వుడ్‌హౌస్‌కి చక్కటి ఆఫీసు యిచ్చారు. ప్రతి రోజూ వచ్చేవాడు, కూచునేవాడు, టైమయిపోగానే యింటికి పోయేవాడు, వారం, రెండు వారాలు, నెల, రెండు నెలలు, నాలుగు నెలలు-చిట్టచివరికి సంవత్సరం గడిచింది. ప్రతి శని వారం రెండువేల డాలర్ల చెక్కు ఖచ్చితంగా ముట్టుతూ వుండేది. ఒకరోజున వుడ్ వర్డుతో అన్నాడు. "చూడండి, ప్రతివారం రెండువేలు చొప్పున యిచ్చారు. నేను వాళ్ళకి చేసిపెట్టిన పనేమీ లేదు."

"పోనిద్దురూ—మీడబ్బు మీకు ముడుతోందిగదా! వాళ్ళు ఏగోతిలో దిగితే మీకేం!" అన్నాడు వుడ్ వర్డు.

"నాకు చిన్నతనం కాదుటండీ-యింగ్లండునుంచి నన్నిక్కడికి రప్పించి, నాచేత ఏపని చేయించుకోకుండా ప్రతి

వారం రెండువేలు యిస్తాడం మిగతా కథలగురించి చర్చిస్తు న్నప్పుడయినా నన్ను పిలవవచ్చుగా!''

"మీకంత చిన్నతనంగా ఉంటే నేను చెప్పినట్టు చెయ్యండి. ఆ పైకం యావత్తూ వంద డాలర్ల నోట్లగా మార్చి, యమ్. జి. యమ్. ఆఫీసుకెళ్ళి, ఆనోట్లు వాళ్ళ మొహంమీద కొట్టి మీదారిని మీరు యింగ్లండు వెళ్ళి పోండి.''

వుడ్‌హౌస్ అలాంటి పని ఎంతమాత్రం చెయ్యలేదు. రెండులక్షల డాలర్లూ ఎంచక్కాగా యింగ్లండుకి పట్టుకు పోయాడు.

1937 లో వుడ్‌వర్థు ప్రపంచం చుట్టివచ్చేందుకు వెళ్ళాడు. జపాన్‌లోని కోబ్ క్లబ్‌లో జరిగిందిది. 'రెండుపాములు ఒకదా న్నొకటి తినబోయి, రెండూ ఒకదా న్నొకటి తినేస్తే ఏమి మిగులుతుంది?' ఇదీ సమస్య. దీనిగురించి క్లబ్ మెంబర్లు తీవ్ర వాదప్రతివాదాలు సల్పుతూ వుండగా వుడ్‌వర్థు అంటాడు; 'ఐన్‌స్టీన్ చెప్పిన ప్రాబ్లెమ్ 492 యిది—మీకెవరికీ తెలీనే తెలియదా! రెండు పాములూ ఒకదాన్నొకటి తినేస్తే, పాములు రెండు మాయమవు తాయి—ఏమీ మిగలదు.' క్లబ్ మెంబర్లు కడుపు చెక్క లయేటట్టు నవ్వారు.

వుడ్‌వర్డ్ మహామేధావి కాదు. రాజకీయ చతురుడు కాదు; ఉత్తమ కావ్యాలు రచించిన కవికాదు;– సామాన్య

పోయాడు, జీవితం ఎటు గిరవాటువేస్తే అక్కడ వొదిగి కాలక్షేపంచేసి, జీవన ప్రవంతిలో గమనం సాగించాడు. పండబారిన ముసలితనంలో బిజినెస్ యడ్వయిజరీ కౌన్సిల్ మెంబరై, కోటీశ్వరులతో పరియాచకాలాడిన యితను, ఒకప్పుడు తాపీవానికి అసిస్టెంట్‌గా పనిచేయడానికి కూడా అంగీకరించాడు.

వ్రడ్ వర్తు జీవితాన్ని ఎదిరించడు; ప్రశ్నించడు—రెండు చేతులా కౌగిలించుకుంటాడు.

"తినడానికి తిండి, తలదాచుకునేందుకు స్థలం, చేసేందుకు పని—ఈ మూడింటి తర్వాత ముఖ్యమైనది ప్రేమ. మనిషి ఎప్పుడూ ప్రేమిస్తూ వుండాలి. ప్రేమించేందుకు స్త్రీగాని పురుషుడుగాని లేనిపక్షంలో మానవలోకానికి మేలు చేసే 'కాజ్'ని ప్రేమించాలి. వయసులో వున్న పురుషునికి స్త్రీ, అలాగే వయసులో వున్న స్త్రీకి పురుషుడూ—ఎక్కడో అక్కడ వుండకపోరు. కాని ప్రేమ ఈ భూమండలమంత విశాలమైనది. పిల్లల్ని, తలిదండ్రుల్ని, వృద్ధుల్ని, నిస్సహాయుల్ని ప్రేమించవచ్చు. అభిమానంతోనూ ఆపేక్షతోనూ ఎవరినో ఒకరిని ప్రేమించడం జీవితానికి అవసరం. ఎవర్నీ, దేన్నీ ప్రేమించలేని మనుష్యుల మొహాలు ఎంత వికృతంగా నిస్సారంగా ఉంటాయో చెప్పలేము."

# రాజరక్తం

క్రిస్టమస్, కుటుంబం అంతా సుఖప్రదంగా కలుసుకున్నారు. నిరుడు క్రిస్టమస్‌కి తను యింగ్లండులో హాస్పిటల్లో ఉన్నాడు. కాలు పొట్టపడిందేగాని బతికి బట్టకట్టాడు.

అర్ధరాత్రి కాబోతోంది. పండగ ఆర్భాటమంతా నీల్ యింట్లో కనిపిస్తోంది.

టేబుల్ ముందు కూచుని నీల్ తండ్రి అన్నాడు: 'అబ్బాయ్, నీకాలికి అవకరం వచ్చింది కనక స్పోర్ట్స్‌మెన్‌గా ఎలానూ రాణించలేవు. మనింటి పేరువుంది చూశావూ—కింగ్స్ బ్లెడ్. రాజరక్తం మన నరాల్లో ప్రవహిస్తూ వుండాలి. నువ్వు కాస్త ఘట్టిగా పరిశోధన చేస్తే మన పూర్వీకుల భోగట్టా, వంశవృక్షం, ఎప్పుడు మన తాత ముత్తాతలు ఈ అమెరికాకి వలసవచ్చిందీ బయటపడక మానవు. నా మనుమరాలు యూరప్‌లో ఒక దేశానికి రాణీ అవటం ఎవరికి గర్వకారణం కాదు ?'

అయిదారేళ్ళ తనకూతురు రాణీ కావచ్చునన్న తండ్రి సూచనకి నీల్ లోలోన నవ్వుకున్నాడు. నీల్ భార్య వెస్టాల్ ఈ సంగతే పట్టించుకోక మిగతా బంధు మిత్రులతో పకపక లాడుతోంది. పెద్దవాడిమాట తోసిపుచ్చడం యిష్టంలేక 'అలాగే' అంటూ తలవూపాడు నీల్.

నీల్ తండ్రి ప్రసిద్ధ వైద్యుడు. పేరొందిన అమెరికన్. అమెరికన్ స్వభావ లక్షణమైన ఒకమాదిరి బాల్యచపలత నీల్ తండ్రిలో కనిపిస్తుంది. క్రిస్మస్ రోజున ఏదో హుషారులో 'కింగ్స్ ఇంగ్లీష్' గురించి తండ్రి ప్రస్తావించా డనుకున్నాడు నీల్. ముసలాయన అంతటితో వూరుకోక ఒకటికి నాలుగు సార్లు పునఃపోల్చడంతో నీల్ కి వేడిపుట్టింది.

నీల్ బాంకులో గౌరవమైన ఉద్యోగం చేసుకుంటున్నాడు. కుడీ ఎడమా తెలీని అవివేకుడు కాడు. సింహాసనాలకోసం పాకులాడే దొంగవారసుల కథలనేకం అతను చదివివున్నాడు. వయసు మళ్ళిన తండ్రికి ఈ వెర్రి ఎందుకు జనించిందో అతనికి ఎంత తరిచినా బోధపడలేదు. కనిపించినప్పుడల్లా తండ్రి : 'అబ్బాయ్—పరిశోధన సాగిస్తున్నావా ? ఓపికగా వెనకటి దస్త్రాలు తిరగేయించు. నా మనమరాలికి రాజయోగం రాసివుంది' అంటూండేవాడు.

ఆఖరికి ఒకరోజున తండ్రిని తృప్తి పరిచేందుకు నీల్ తాత ముత్తాతల గురించిన వివరాలు వాకబు చెయ్యడం మొదలెట్టాడు. తీగె కదిపితే డొంక కదిలింది. రాజరక్తం మాటదేవుడెరుగును గాని తన మాతామహివైపున నీగ్రో రక్తం వుందని ఆచోకీ తెలిసింది. నీల్ నిలువునా నీరయాడు.

ఎన్నాళ్ళు దాచగలడీగుట్టు? దురాశ దుఃఖానికి చేటన్న సామెత మాదిరి అయింది తమ బతుకు. అమెరికాలో నీగ్రో అవడంకంటె తలవంపు ఏముంది ? నీగ్రోలనగా నల్లగా కొర

కొంచెమైనా ఆఫ్రికనుల మాదిరి ఉండనక్కర్లేదు. నీగ్రో సంపర్కం ఏమాత్రం ఉన్నా అతనికి తెల్లవారిలో పరపతి పోతుంది. వారి క్లబ్బులకీ, హోటళ్ళకీ పోయే అర్హత ఉండదు. ఆస్పత్రిలో కూడా ఈ ఎక్కువ తక్కువలు ఉన్నాయి. నీగ్రో అనగానే చిన్న చూపు చూస్తారు. పట్టణంలో రెండు భాగాలు ఉంటాయి—నీగ్రో నివసించేందుకు ఒకటి; తెల్లవారికి మరొకటి. తెల్లవారు నీగ్రో కాలనీవైపు తొంగి చూడరు. నీగ్రోలు కూడా తెల్లవాణ్ణి అనుమానాస్పదంగా చూస్తారు.

తనలో నీగ్రో రక్తం ఉందని తెలిసిన మర్నాటినుంచీ నీల్ కి నీగ్రోలతో పరిచయం వృద్ధిచేసుకోవాలన్న తృష్ణ ఎక్కువయింది. ఏనాటో తన పాపం పండుతుంది. తలలో నాలుకవలె మెసులుతున్న వెస్టాల్ తనని వదిలేస్తుంది—కూతురుతో సహా తన పుట్టింటికి పోతుంది. నీగ్రో కాలనీయే తనకి దిక్కు. నీల్ నెమ్మదిగా నీగ్రోలతో పరిచయంచేసుకుని తనూవాళ్ళవాడేనని చెవులో వూదాడు.

నీగ్రోలలో చదువుకున్నవారు లేకపోలేదు. మహా మేధావులూ, రసాయనశాస్త్రనిపుణులూ వున్నారు. కాని, వారు నీగ్రోలై పుట్టడంవల్ల ఎన్నో ద్వారాలు మూసుకు పోతాయి. నీల్ స్నేహితుడు యాష్‌ప్లాస్టిక్ పరిశ్రమకి జీవగర్ర; నీల్ స్నేహితురాలు సోఫియా. రెండు కళ్ళూ మూసుకుంటేగాని తుపాకీ పేల్చలేకపోయినా—మానవ హృదయంలోని లోతుపాతులు తెలుసుకున్న చతురమతి.

సీల్ తనలోని ద్వంద్వం భరించలేక గుండెల్ని పీకుతున్న పరమ రహస్యం తండ్రిముందు వెళ్ళగక్కాడు.

"ఏదో పొరబాటు సంభవించి ఉంటుంది. అదెన్నటికీ కాదు. గట్టిగా అనకు, నలుగురూవింటే నగుబాట్లు" అని గదమాయించాడు తండ్రి. ఇదప్పుడే పది పన్నెండు గురికి తెలుసునన్నాడు సీల్. గుప్పుమంది. తండ్రి ఈ అప్రతిష్ఠ ఊరంతా పాకకుండా చెయ్యాలనుకున్నాడు; లాభంలేక పోయింది. సీల్ తల్లి కొడుకు మాటల్లో సత్యం లేకపోలేదంది.

వెస్టాల్ మొగుణ్ణి అడిగింది: "నాతో ముందయినా చెప్పకపోయారా?"

"చెప్తే?" అన్నాడు సీల్.

"నిజం నిలబెట్టడంకోసం మనమేమయినా ఫరవాలేదు. అమ్మాయి సంగతి?"

"నువ్వు నాకు అండగా నుంచుంటావా!" అడిగాడు సీల్.

"ఎంత వెర్రివాడివి సీల్" అంటూ అతని వీపు తట్టింది వెస్టాల్. ఆమెలో అంత అనురాగం, సహనశీలతా ఉంటాయని సీల్ భావించలేకపోయాడు. కృతజ్ఞతతో అతనికళ్లు చెమ్మగిల్లినై.

"మనని విడదియ్యాలని లోకం కంకణం కట్టుకుంటుంది. కాని, మనని ఎవరూ విడదియ్యలేరు" అంది వెస్టాల్. అలాటి ప్రేమపూరిత వాక్యాలు విన్న సీల్ మృత్యువుని కూడా జయించగలడు.

వాడివాడిగా చెప్పాడు. ఆ వాడి కత్తుల్లో కీర్తి ఒక్కటే నీగ్రో, నీల్ కి అప్పగించబడింది. పాక్ వల్ల తంత్రి మరిగించారు. కోర్టుల్లో అతనిచేత రాజసేవా యిప్పించారు. వెనకటి పరిచయాలు మొహం తప్పించుకు తిరుగటానికి పెట్టారు. కొందరు నా క్లీనులు మొహామ్మాదే 'నిగ్గర్' (నీగ్రోకి నీచపదం) అనకూడని మాటకొంతేమ. నీల్ని నీగ్రో కాలనీకి తరిమెయ్యాలని తెల్లవారి ప్రబలప్రయత్నం. తను డబ్బిచ్చి కొనుక్కున్న యిల్లు ఖాళీచేసి వెళ్ళనని నీల్ వాదన. కోర్టులూ పోలీసుబందోబస్తూ తెల్లవారి పక్షాన ఉన్నాయి. నీగ్రో నీల్ పితూరీదారు, విప్లవకారుడు, ప్రజాశాంతిని భంగపరిచే ప్రమాదకరమైన మనిషి—యిలాంటి ఆక్షేపణలు పరిపాలవాదతులకి ఉండనే ఉన్నాయి.

ఒక రాత్రివేళ నీల్ యింటిని జనసమూహం చుట్టుముట్టేసింది. నీల్ కూడా తన జట్టుతో లోపల తయారుగానే ఉన్నాడు. ఇంట్లో పదెనమండుగురు ఉన్నారు—బయట వేలకొద్దీ. బయటి ప్రజలు అరుపులూ కూతలూ తిట్లూ సాగించారు—టెలిఫోన్ తీగె అంతకు ముందే తెంపేశారు—టెలిఫోను చేసినా పోలీసులు వస్తారు కనకనా!

చేతిలో తుపాకీ పట్టుకు నీల్ తన యింటిగుమ్మం ముందర నుంచున్నాడు. 'లోపల కాలుపెట్టేరా పేల్చేస్తాను' అన్నాడు నీల్.

"ఓస్—పదండి—ముందుకు" అంటూ ముగ్గురు నాయకుల్లో ఒకడు ఆవరణలో పాదం పెట్టడమేమిటి, అతను గిర్రున తిరిగి కూలడమేమిటి ఒకే క్షణంలో జరిగాయి.

"హాఁ తారా—ఇంకా కాల్చనా?" అని బెదిరించాడు నీల్.

అదే అదనులో మేడమీదనుంచి నీల్ జట్టులోని మనుషులు మూకమీద తుపాకీగుళ్ళవర్షం కురిపించారు. ప్రజలు చెల్లాచెదరై పారిపోయారు. టైముకోసం సందుచివర కాసుకున్న పోలీసులు లారీతో నీల్ యింటిముందు ప్రత్యక్షం అయారు. విప్లవకారులకి బేడీలు తగిలించారు.

"నిన్ను అరెస్టు చెయ్యమని మాకు చెప్పలేదు" అన్నాడు వెస్టాల్‌తో పోలీసధికారి.

"అలాగా—మమ్మల్ని విడదియ్యాలని చూస్తున్నావా?" అంటూ పక్కనున్న తుపాకీమడమతో ఆ అధికారినెత్తిని ఒక్కటి పెట్టింది వెస్టాల్.

అప్పుడు వెస్టాల్నికూడా అరెస్టుచేశారు. మొగుడూ పెళ్ళాం యిద్దరిని ఒకేలారీలో పోలీస్ స్టేషన్‌కి తీసుకువెళ్ళారు.

---

# తూర్పు పడమరలు

రడ్‌యార్డ్ కిప్లింగ్ ధైర్యంగా అనగలిగాడు. 'తూర్పు తూర్పే—పడమర పడమరే' అని. కాని బుద్ధిమంతులు ప్రాక్పశ్చిమ విధానాలకి సమన్వయం కుదర్చాలని నిరంతరం శ్రమిస్తూవుంటారు. చైనా అతి పురాతన దేశం. పడమటి దేశాలవాళ్ళు గుర్రాలజూలు పులుపుతూవున్న కాలంలో చైనా సామంతులు గుర్రపుస్వారీ చేసేవారు. క్రీస్తు పాశ్చాత్య దేశాలకి మానవధర్మం బోధించడానికి ఐదు వందల సంవత్సరాలకి పూర్వం చైనాలో ఉత్కృష్ట నాగరికత ఉండేది. వరదలూ, దారిద్ర్యం, శత్రుభయం—అనే మూడూ మూసలో వేసి కరిగించి తమ జాతీయజీవనాన్ని ఏర్పాటు చేసుకున్నారు చైనీయులు. నలభై అయిదుకోట్లలో ఒకకోటో, అరకోటో నాశనమైనా వారికి లెక్కలేదు. ఆ సంస్కృతి అలా ప్రవహిస్తూవుంటుంది.

షాంఘై యింటర్‌నేషనల్ సెటిల్‌మెంటులోని తెల్లవాళ్ళకి కంగ్—గౌరవనీయుడైన కంగ్-ఒక పట్టాన ఎలా అర్థమవుతాడు? రంగు సులోచనాలతోగాని శ్వేతజాతులు కంగ్‌లాటి మహానీయుల్ని చూడలేవు. కంగ్ కన్‌ఫ్యూషియస్ సంతతికి చెందినవాడు. సంఘసేవా పరాయణుడు. సంఘసేవ అంటే లెక్చర్లు దంచడం కాదు. కూడూ గుడ్డా

[illegible] లాటిది ఒకటి స్థాపించి, ఆ [illegible]

షాంఘైలాంటి పట్టణంలో తిండిలేక అలమటించి పోయేవారు ఒకరూ యిద్దరూనా? వందలమీద కూడా కాదు; వేలకొద్దీ వుంటారు. వీరందరికీ కంగ్ ఆశ్రితజన బాంధవుడు. ఎంత లక్షాధికారికయినా రోజూ మూడువేల మంది కడుపులు నింపడం సాధ్యమయేపని కాదు. అంచేత కంగ్ ఏంచేసేవాడంటే! ధనవంతులని, పెద్దపెద్ద వ్యాపారసంస్థలని తన సమాజానికి విరాళాలివ్వమని కోరేవాడు. వాళ్ళు వుత్తినే యిస్తారా? ప్రత్యుపకారం! వాళ్ళ యిళ్ళనీ, ఆస్తుల్నీ, గిడ్డంగులనీ తన సమాజచిహ్నంతో దొంగభయం నుంచి కాపాడటం. సమాజచిహ్నంతో రక్షింపబడిన యింటి చాలికి ప్రాణాలమీద ఆశవున్న దొంగ పోడు. పోలీసు సిబ్బంది పట్ల భయంకాదు; కంగ్ మనుమలు వాడి పేగులు వూడదీస్తారు. వ్యాపారదృష్టితో చూస్తే కంగ్ చేస్తున్నది ఒకమాదిరి భీమావ్యాపారం. సమాజదృష్టితో చూస్తే ప్రజాసేవ, వ్యాపారం, ధనసంపాదన తప్ప యితరం తెలీని ఆంగ్లేయులకి కంగ్ ఎలా అర్థమవుతాడు?

బర్న్‌సైడ్ షాంఘై జనరల్ యిన్సూరెన్స్ కంపెనీ అధికారి. అతన్ని తన దానసమాజానికి సాయంజెయ్యమని అడిగాడు కంగ్. బర్న్‌సైడ్ వెయ్యిడాలర్లు యిద్దామనుకున్నాడు. కాని కంగ్ అంత పెద్దకంపెనీ ఒక మిలియను

డాలర్లు యివ్వవచ్చుననుకున్నాడు. లాలిత్యం వొలికే పలుకులు చెబుతూ వెళ్ళిపోయాడు కంగ్. బర్న్‌సైడ్‌కి ఈ ధోరణి బోధపడలేదు. నమ్మకస్థుడైన తన ఆఫీసు గుమాస్తాని—అతనూ చైనీయుడే—సంగతేమిటో విశదపరచమన్నాడు.

"మిలియను డాలర్లు యివ్వడంవల్ల మనకి నష్టంలేదు. షాంఘైలో దొంగతనాలు యీమధ్య ఎంత తగ్గిపోయాయో చూడండి. దొంగతనాలు తగ్గితే క్లెయిమ్స్ సంఖ్య పడిపోతుంది. అది కంపెనీకే లాభం. కంగ్ సత్పురుషుడు. అతనికి ధనాశలేదు. ఇదంతా ప్రజోపయోగం కోసమే. ఈ మహాపట్టణంలో జరిగే చౌర్యాల్ని అరికట్టగలిగినవాడు కంగ్ ఒక్కడే" అన్నాడా గుమాస్తా. ఇన్నేళ్ళబట్టీ తన ఉప్పుతింటూ, తనని నమ్ముకుబతుకుతున్న గుమాస్తా కంగ్‌ని—దొంగలముఠా నాయకుడిలా కనిపిస్తున్న కంగ్‌ని—యింతగా భూషించడం బర్న్‌సైడ్‌కి నచ్చలేదు. పాతికేళ్ళబట్టి చైనా గడ్డమీద ఉంటున్నాడే గాని వారి మనస్తత్వం యింకా అవగాహన కాలేదు. ఆ సాయంత్రమే కమీషనర్ విల్లోబికి ఈ దురంతం నివేదించాడు.

విల్లోబి సామాన్య కానిస్టేబుల్ నుంచి ఈహోదాలోకి వచ్చినవాడు. అతని ప్రయోజకత్వానికి మూలకారణం రుజువర్తన. లంచాలు పట్టకుండా, పై అధికారుల మెప్పుని పొందుతూ యిరవై ఏళ్ళ సర్వీసు చేశాడు. విల్లోబి బీదకుటుం

బంగ్లో పుట్టాడు. ఆ కారణంగాన్ని అతనికి స్వతహాగా ఉత్తమ సంస్కారం అలవడ లేదు. ముక్కుకి సూటిగా నడవడమే తెలుసు. 

"కంగ్‌ని కొట్లో పెట్టడం అంత సులువైన పనికాదు. అతను ఏం నేరం చేశాడు ? డబ్బు యివ్వకపోతే- ఏంచేస్తానో చూసుకో—అని బెదిరించాడా ?"

"ఊహుం. వెయ్యిడాలర్లు యిప్పుడువద్దు. మీవద్దనే ఉంచండి. మరోసారి దర్శనంచేసుకుంటాను—అని నవ్వుతూ వెళ్ళిపోయాడు" అన్నాడు బర్న్‌సైడ్. 

"మా ఆఫీసులో అతనిగురించి బోలెడంతరికార్డు ఉంది; నేనైతే అతన్ని యింతవరకూ చూడలేదు. ఎలాఉంటాడు కంగ్ ? భీకరంగా, బందిపోటు దొంగలా..."

"అబ్బే. ఉత్తమకులీనత వెదజల్లే ముఖవర్చస్సు, ఆ విన యం, ఆ నమ్రత, ఆ చిరునవ్వూ...మనమీద మత్తుమందు చల్లుతాడంటే నమ్మండి." 

కంగ్ గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు ప్రతిఒక్కరూ విల్లోబీతో యిలాగే చెబుతూ వచ్చారు. బర్న్‌సైడ్‌ని ఆనాటికి యింటికి పంపించి, మర్నాడు కంగ్‌తో యింటర్వ్యూ ఏర్పాటు చేసుకున్నాడు విల్లోబి. ఇద్దరికీ ఎన్నోసార్లు వాద ప్రతివాదాలు జరిగాయి. కంగామాటల్లో దొరికేది ?

"కమీషనర్, యిది చైనా, మేము అనాగరికుల్లా ఆట విక జాతుల్లా మీకళ్ళకి కనిపించవచ్చు. కాని, మాపద్ధ

తులువేం. నేరస్థులు శిక్షార్హులు కనక శిక్షించబడతారు. తప్పుచేసినవాడు దండించబడవల్సిందే. మా న్యాయపీఠాలు తప్పొప్పులు వక్రీకరించే దృష్టితో చూడవు. మీ పాశ్చాత్య న్యాయవిధానంలో నిర్దిష్టత యింకా ఏర్పడలేదు. బాచ గొండితనం, అవినీతి మానవదౌర్బల్యాలని అనూహ్యంగా మా న్యాయవిధానం ప్రారంభమయింది. మీరూ నేనూ ఒకేకోణంమీద ప్రయాణం చెయ్యలేకపోవచ్చు కాని, నేను యిటునుంచీ, మీరు అటునుంచీవచ్చి ఒకేచోట కలుసుకుంటాం.”

“అలాగేతోస్తోంది. ఏమైనా, ఆ ఋజనులమీద మీకు వుండే ఆపేక్షని నేను సంశయించలేను.”

“మీరు నెమ్మది నెమ్మదిగా నిజం చూడగలుగుతున్నారు. విభేదాలనేవి పైపైన కనిపిస్తాయి. కానీ, ఆంతర్యంలో సహృదయు లందరూ ఒకేమాదిగా ఉంటారు. జాతి మత వర్గ వివక్షతలు సహృదయుల్లో ఉంటాయా? మీరూ నేనూ సహృదయులమని నా విశ్వాసం” అన్నాడు కంగ్.

విల్లోబి కంగ్‌ని ఏవిధంగానూ పట్టుకోలేక, కంగ్ నిఘా వల్ల పోలీసువాళ్ళకి పనితగ్గిందికదా అని సంతోస్తాడు కాని, ఎప్పటికైనా అవకాశం దొరకదా అని, ఆ అవకాశంకోసం ఎదురుచూస్తూవుంటాడు. కంగ్ మహావ్యక్తి అని విల్లోబికి అంతరాంతరంలో తెలుసు గాని, పోలీసుదళంకంటె బలవంతుడైన మరోవ్యక్తి షాంఘైలో ఉండటం అతని ప్రతిష్ఠకి భంగంకాదూ?

కంగ్ వయసు ఇరవైపై ఇరవైపై అయిదూ మధ్య. అతను ప్రఖ్యాతికెక్కిన ముత్యం అనే భోగంపిల్లని ప్రేమించాడు. ఆమె ఇష్టంగా వెళ్ళనప్పుడల్లా తన తోటలో పూసిన గులాబీపూలు పుష్పగుచ్ఛాలు పంపుతుండేవాడు. ముత్యమైనా, పడమటనైనా అమ్మాయిలు పుష్పాల్ని కవిత్వాన్ని ప్రేమిస్తారా—వారికి నగలు కావాలి గాని పూలగుత్తి ప్రత్యేకముత్యానికి నచ్చేది కాదు. ఎన్ని వేల ఖాళ్ల ఖరీదైన వజ్రాలహారం కావాల నేది. తను ఏమవ్వగలడు కంగ్. ఆమె యింకా కన్యాత్వం చెడనిపిల్ల. అంతస్తేగాని కొనుక్కొనేందుకు వేచివున్న వారిలో కంగ్ ఒకడు.

ముత్యం కంగ్‌ని హీనపరచాలని, బజార్దాయిలాటి తన పోషకుడితో ఒక కుట్రపన్నింది. కంగ్ ఈవ్యామోహంవల్ల అనేక కష్టాలకి లోనై, ఆఖరికి పోలీసువాళ్ళచేతిలో పడ్డాడు. కంగ్‌ని యిలా చిక్కుల్లోకి తీసుకువచ్చిన వాడు బర్న్‌సైడ్.

"విూరిది చేతులారా చేసుకుంటున్నారు. కంగ్ కావాలని ఈ కేసు కల్పించుకుంటున్నాడు. అతని నేరం రుజువుకాదు. నవ్వులపాలయేది తెల్లవాళ్ళే! మనకి మొహం చెల్లక పోవడం అంటే ఏమిటో తెలీదు. మొహం చెల్లడమనే ప్రయోగమూ, దానిపరమార్థం ఆసియాఖండవాసులకే తెలుసు. ప్రాసిక్యూషన్ సాక్షులు నలుగురు. ముత్యం— వృత్తిపల్ల నర్తకి. ఆమె సోదరుడూ, ఆమె పనిమనిషి— ముగ్గురుసాక్షులై పోయారు. నాలుగోవాడు: పోలీసుశాఖ

నుంచి పారిపోయిన చిన్న ఉద్యోగి. ఇలాటి నలుగురు సాక్షులతో ఏక్రిమినలు కేసూ నెగ్గడం నేనెరగను. కంగ్ మీద మనకి కోపం ఎందుకు! అతనిపని అతను చేసుకుంటాడు; మనపని మనం చేసుకుందాం" అన్నాడు కమీషనర్ విల్లోబి వారంటు అడగటానికి వచ్చిన బర్న్‌సైడ్‌తో.

"ఐతేనాన్ బైలబుల్ వారంటు యివ్వరా?" అన్నాడు బర్న్‌సైడ్ కోపంగా.

"నాన్ బైలబుల్ వారంటా? నవ్విపోతారు. చూస్తూ చూస్తూ ఉద్యోగానికి నీళ్ళువొదులుకు నేపాటి మూర్ఖుణ్ణికాను నేను. భీమాకంపెనీలకీ, ప్రజాసేవాసంస్థకీ జరుగుతున్న వైరంలో పోలీసుశాఖ ఎందుకు యిరుక్కుంటుంది?"

బర్న్‌సైడికి మతిపోయింది. తన జాతివాడూ, తనదేశం వాడూ అయిన విల్లోబి యింత నిష్కర్షగా మాట్లాడటంవల్ల వొళ్ళువుడికిపోయింది. కాని, ఏంచేస్తాడు? కంగ్‌తో పేచీ పెట్టుకు బాధపడుతున్నది తను.

జామీనుమీద విడుదలచేశారు కంగ్‌ని. ఆతర్వాత కేసు జరిగింది. తీర్పుజెప్పేరోజున కోర్టుకిబయటవున్న జనసందోహం చూసి దృఢచిత్తం గల విల్లోబికూడా గడగడలాడాడు. నిర్దోషి అని తీర్పుజెప్పని పక్షంలో ప్రజలుకంగ్‌ని ఎత్తుకు పోయేవారేమో కూడాను కాని, కంగ్‌మీద ఏనేరమూ రూఢీకాలేదు. అతని ఘనత మరొకసారి లోకానికి వెల్లడయింది.

"చైనా పాశ్చాత్య భావాలసి నమలకుండా మింగి, అజీర్తితో బాధపడుతున్నమాట నిజమే. కాని పోలీసుబలగం లేని సాంఘికవ్యవస్థ చైనాది. కాలేకడుపులు నింపి, నేరాల సంఖ్య తగ్గించవచ్చు. నేరస్తులనేవారు స్వతహాగా ఉండరు. అదివ్యక్తిలోపంగాదు. సంఘలోపం. చోరభయం మనుషుల మనసుల్లో ఉండటంవల్ల భీమాకంపెనీలు బతుకుతాయి. అసలు చౌర్యాన్ని నిర్మూలించాలిగాని భయానికి మందు వేస్తూవుంటే ఎలా?" అన్నాడు కంగ్ విల్లోబితో. కమీషన్ ఏనాడో ఈచైనాపండితుడి విద్వత్ ముందుతనవోటమిని అంగీకరించాడు. ఎటొచ్చీ, కంగ్ పోలీసుశాఖకంటె బలవంతుడు కాకూడదని అతనిమనోవాంఛ.

"అందంగా ఉండటంకంటె, అందాన్ని చూడగలగటం, అందాన్ని సృజించడం గొప్పవని పూజ్యులైన కంగ్ నుంచి తెలుసుకున్నాను" అంది ప్రత్యూషముత్యం కంగ్ పాదాల దగ్గిర కూచుని.

# శ్రీకాంత్

తెల తెల్లవారుతోంది. వైష్ణవి కమలలతతో రైలు మలుపులోకి మాయమవుతోంది. నాది వొట్టి దేశదిమ్మరి బతుకు. జీవితయానంలో అపరాహ్ణం గడిచిపోయింది. అప్పుడే మూడవజాము. ఎందుకో స్మృతి ప్రవాహం తీరాన్ని పదేపదే తాకుతోంది.

ఇంద్రనాథుడీనాడు సజీవుడై వున్నాడా? గంగామాటీలో రాజలక్ష్మి మేడమీద కూచుని దిగులుగా పరిసర ప్రకృతిని పరిశీలిస్తున్న సమయాన నన్ను తాకినగాలి ఇంద్రనాథుని స్పృశించి వచ్చిందా ?—అనిపించింది. ఆ చిన్ననాటి తెంపరితనం ఈ నాడింకా నరాల్లో వుందా ?

పంతులు పిలక కత్తిరించి, ఆయన జేబులోనే ఆ పిలక పడేసిన పోకిరీ ఇంద్రనాథుడు. అతని ధైర్యసాహసాలు, పది హేనేళ్ళు నిండకపూర్వం గంగానదిలో అర్థరాత్రివేళ మేము చేసిన నౌకాయాత్రా తలపుకి రాగానే, అక్క అన్నదా గుండెలమీద ముద్రవేస్తుంది. ఇన్నేళ్ళుబట్టీ వెతుకుతున్నాను గాని అక్క మళ్ళీ కంటికి కనిపించనేలేదు. నక్షత్రాలు శూన్యంలోకి జారినట్లు ఆత్మీయులలా ఎందుకు జారిపోతారో!

పాములవాడు శాహజీ ధర్మపత్ని మా అక్క అన్నదా. ఇంద్రుడికి శాహజీని మంచి చేసుకుని పాము మంత్రాలు

నేర్చుకోవాలని అభిలాష. తాగుబోతు శాహాజీ డబ్బు కాజేసేవాడుగాని మంత్రం చెప్పేవాడు కాడు.

గాలి దుమారాలకు, తుపానులకు, అడ్డంకులు, అవరోధాలు ఎప్పుడూ ఒక ఘనకార్యాన్ని సాధించే జీవిని ఏమి చేయలేవు. పురోగమనమే వారి జీవితలక్ష్యం—ధీరులు కనుకనే

"ఫర్టిలైజేషన్ ఆఫ్ ఆల్ బిడ్సు" "మూవ్మెంట్సు అండ్ హాబిట్సు ఆఫ్ క్లయింబింగ్ ప్లాన్ట్సు" అనే పుస్తకాలు రచించాడు.

18 1 లో 'ది డీసెంట్ ఆఫ్ మాన్'తో అతని పరిణామ సిద్ధాంతీకరణ ఇంచుమించుగా ముగిసిన దనవచ్చు. దీనితో సృష్టికర్తను మానవచరిత్రనుండి తుడిచివేసి, మానవుడు నాలుగు కాళ్ళ జంతువునుండి పరిణామం చెందుతూ వచ్చాడని సిద్ధాంతీకరించాడు.

మానవ చరిత్రలోని సరికొత్త అధ్యాయాన్ని సృష్టించి, ప్రకృతిలో దాగుడు మూతలాడే రహస్యాలను వెలికితీసి ప్రచారం చేసిన డార్విన్ డౌనె పల్లెలోనే 1882 ఏప్రిల్ 19 న మరో ప్రపంచంలోకి నిష్క్రమించాడు.

అతడు నవయుగ ప్రవక్త కాడని ఎవరనగలరు ?

ఒకరోజున ఇంద్రనాథుడు వారిమీద మండిపడగా, అన్నదా వర్తకమర్మం బయలుపెట్టింది. "పిచ్చి అబ్బాయిలూ, మంత్రాలకి చింతకాయలు రాలవు. ఆయనకి

వచ్చిన మంత్రంలేదు, తంత్రంలేదు. మీ దగ్గిర డబ్బు గుంజేందుకు ఈ ఎత్తు!”

ఇంద్రనాథుడు వెంటనే ఆమెని నమ్మలేక పోయాడు గాని నేను నమ్మేశాను. అంతమంచి అక్క అబద్ధమాడుతుందా? పాములవాడు పాము కాటుతో మరణించాడు. నేనూ, ఇంద్రుడూ, అన్నదా ముగ్గురం కలిసి అతన్ని సమాధి చేశాం. ఆ చిట్టడివిలో జీజీ ఒక్కతె ఎలా వుంటుంది? ఆమెకి మేమిద్దరమే ఆప్తులం. కాని, జీజీ (అన్నదా) మా మనసు పాడుచేసుకోవద్దని బోధిస్తూ, మాయిద్దరి స్నేహం అక్షయంగా వుండాలని ఆశీర్వదిస్తూ ఒక ఉత్తరం రాసి దుర్గమ ప్రపంచ పథాన ఒంటరిగా వెళ్ళిపోయింది—మాకు ఈషణ్మాత్రం తెలీకుండా. కులం చెడినా, మతం పోయినా, దరిద్రం పీడించినా విశుద్ధ నారివలె పతిసేవలో కాలం వెళ్ళ బుచ్చుకుని, అతని మరణంతో అదృశ్యమయింది అన్నదా అక్కయ్య. మొదటిసారి జీవితాన్ని ప్రేమా స్పదంగా తాకిన స్త్రీ మూర్తి, మా జీజీ.

ఒక జీవితం గురించి తుణ్ణంగా చెప్పాలంటే ఎంత రాసినా తరగదు. కొన్ని సంఘటనలు నిన్నో మొన్నో సంభవించినట్లు సుస్పష్టంగా జ్ఞాపకం వుంటాయి. మరికొన్ని అడుగున పడిపోతాయి. అదీకాక, సంఘటనలు క్రమ విహీనంగా మనోవీధిలో మెరుస్తాయి.

కుమార్ సాహబ్ ఆహ్వానించగా 'షికారీ'కి—అనగా వేటకి—వెళ్ళాను. జమీందారుగారు సమస్తం పసందుగా

ఏర్పాటు చేశారు. ప్యారీబాయి నృత్య కౌశలం, గాన మాధుర్యం శ్లాఘింపదగినవి. కాని ఆ ప్యారీ బాయే నా బాల్యంలో వాకాకాయి పూలదండ మెడలోవేసి నన్ను వరించిందట. వివరాలతోనూ సంజాయిషీలతోనూ నచ్చ చెప్పేదాకా ఆ సంగతి నమ్మలేదు. రాజలక్ష్మి సామాన్య స్త్రీ కాదు. తప్పిపోయిన నన్ను, కాలం ఖర్మం కలిసిరాగా పట్టుకుంది—ఇంక వుచ్చులు పన్నడం మొదలు పెట్టింది.

స్మశానం అర్ధరాత్రివేళ 'విజిట్' చేస్తానని రాజావారి నిండుకొలువులో నేను అనేశాను. రాజలక్ష్మి నన్ను తన డేరాకి పిలిపించుకుని ఆ మాదిరి అఘాయిత్యాలు మానమని వారిస్తూ 'భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ గాలిదయ్యాల' విషయమై ప్రస్తావించింది.

"నాకు లేనిభయం నీకెందుకు ?" అన్నాను, ఎగతాళిగా.

ఆ రాత్రి స్మశాన సందర్శనం చేశాను. జన్మకి సత్యం చావొకటే! మిగిలిన సంక్షోభాలూ, ద్వంద్వాలూ అవ్వాయి చువ్వల్లా క్షణికాలు. నిశీధానికి ఒక ఆకృతివుందని ఆ స్మశాన భూమిలో నాకు అనుభవమయింది. వెలుతురునే కాదు— చీకటికి కూడా ఒక రూపం వుంది.

మర్నాడు ప్యారీబాయి (రాజలక్ష్మి) ప్రాధేయ పూర్వ కంగా అడిగింది. "శ్రీకాంత్, యిది నీలాటి మనుషులు వుండదగిన స్థలంకాదు. కుమార సాహెబ్‌గారి సాంగత్యం 'దూదూ' బసవన్నలకి కాని నీకు కాదు. నువ్వు తక్షణం వెళ్ళిపో, యిక్కణ్ణుంచి."

ఆమె మాట ప్రకారం తక్షణం వెళ్ళిపోయాను. 'మంచి రోజుల్లో కాకపోయినా చెడుదినాల్లో అయినా రాజలక్ష్మి జీవించి వుందని మరవకు' అంటూ సజల నేత్రాలలో నాకు వీడ్కోలు యిచ్చింది. ఇల్లు చేరుకోగానే ప్యారీబాయికి ఉత్తరం రాశాను.

అమాంతం ఒకరోజున, జీవితంమీద రోతపుట్టి, సన్యాసుల్లో కలిసిపోయి, ప్రాణాల మీదికి తెచ్చుకున్నాను. ఆరా స్టేషన్ దగ్గిర సత్రంలో స్పృహతప్పి పోయింది. తెలివివచ్చే వేళకి రాజలక్ష్మి, ఆమె సవితి కుమారుడూ బంకూ నాకు పరిచర్యలు చేస్తున్నారు. రాజలక్ష్మి నన్ను పాట్నా పట్టుకు పోయింది.

ఆమె నాకు ప్రాణదానం చేసింది. మా ఇద్దరివీ ఒక మాదిరి కర్కశస్వభావాలు. సవితి బిడ్డకు బంకూ దృష్టిలో న్యూనత పొందడం ప్యారీబాయికి యిష్టంలేదు. నేనక్కడ నెలలకొద్దీ మకాంవేస్తే అనుమానం కాక మరేం కలుగుతుంది? రాజలక్ష్మి ఋణం నేను ఎలా తీర్చుకోగలను? అన్నదా జ్ఞాపకంవచ్చింది. అక్కా బతుకేయింతా! దుఃఖాశ్రువులతో, శూన్య హృదయభారంతో సాగి పోవలసిందేనా! ఇదేనా విశ్వప్రేమ పిలుపు? రాజలక్ష్మిని వొదిలివొచ్చేశాను. తిరిగీ కలుసుకుంటానని అనుకోలేదు.

ఏ విరాట్‌శక్తో నా జీవనస్రవంతిని మెలికలుగా తిప్పుతోంది. ఉత్తరాల్లో ప్యారీబాయి నన్నో యింటివాణ్ణి

కమ్మని ఉపదేశిస్తోంది. ఇంతవరకూ మహాసముద్రాన్ని దూరంనుంచి చూస్తున్నా, ఈనాడు దాన్ని దాటెయ్యగలనని మొండి ధైర్యం కలుగుతోంది. ఓ డెక్కాను—బర్మాకి.

ఓడలో యిందరుండగా అభయకి నేనే కనిపించాలా? ఆమె నోట రోగిష్టి రోహిణీ బాబు. 'సిండ్రెలాంటి పిల్ల—అదృష్టవంతుడివి,' అంటాడు ఓడ డాక్టరు. అభయ తన భర్తని వెతుక్కునేందుకు బర్మా వస్తోంది.

అభయ అంత యాతనపడి వచ్చిందేగాని ఆమె భర్త వొట్టి తాగుబోతూ, తుంటరీను. ఆమెని వొదిలిపెట్టి, అప్పటి కెన్నో ఏళ్ళయింది. ఈలోగా ఒక బర్మా స్త్రీని చేరదీశాడు. భర్త హింసలు భరించలేక అభయ రోహిణీ బాబు పంచని చేరుకుంటుంది.

అభయని చాలా కఠినమైన ప్రశ్న వేశాడు ఈ శ్రీకాంత్ "అన్నదా, ప్యారీబాయీ దుఃఖాన్ని ఆలంబనగా చేసుకున్నారు. కాని, నా కదికూడా లేదు. భర్తసమక్షంలో నాకు లభించింది అవమానం. సిగ్గుతో కుళ్ళిపోవడంకంటె నన్ను నమ్మిన రోహిణీబాబుకి యింత వుడకేసి పెట్టి, కష్టసుఖాలు పంచుకోవడంలో యిహం పరం వున్నాయి," అందామె.

కొత్తకాపరం చేస్తున్న అభయ ప్లేగు హడావిడిలో జబ్బుపడ్డ నన్ను తన యింట్లో వుంచుకుని కంటికి రెప్పలా

కాపాడింది. చెమ్మగిలిన నేత్రాలతో అభయ నన్ను ఓడ ఎక్కించింది.

కలకత్తా రేవులో దిగేప్పటికి బంకూ, యిత్యాదులు. రాజలక్ష్మి నా ప్రియురాలు—ప్యారీబాయి గాన కోవిదు రాలు. ఈ స్పర్థతో తిరిగీ స్వగ్రామం చేరుకున్నాను. బక్క కోపంతో మావూరు వచ్చాను గాని యిక్కడ నా మొహం చూసే దిక్కేదీ ? మళ్ళీ జబ్బుపడ్డాను. కాస్త డబ్బు పంప మనిరాస్తే, రాజలక్ష్మి పరివార సమేతంగా వూడిపడింది.

ఇంక నేను ఆలోచించ దలుచుకోలేను. పడవ చుక్కానీ ఆమె చేతికి వొప్పగించాను. ఆలోచనలకి బీగంవేసి ఆమె దారిని నడవడమే శ్రేయమని తోచింది ! ఎందుకు వృథాగా గింజుకోవడం—జరగనున్నది జరగక మానదు.

నాది మలేరియా జ్వరమనీ, గంగామాటి అనే పల్లె టూరు తీసుకు వెళ్ళాలనీ రాజలక్ష్మి తీర్మానించింది. సమస్తం ఆమె చేతుల్లో పెట్టాక యింక నాదేముంది ? గంగామాటీకుగ్రామం; సాయిథియా స్టేషన్‌లోదిగి పన్నెండు కోసులు ఎడ్లబండి మీద పోవాలి.

ఇలా చెపుకుపోతూ వుంటే నా కథకి అంతెక్కడ ? గంగామాటీలో నేనయితే కోలుకున్నానుగాని రాజలక్ష్మి ఉపవాసాలతోనూ వ్రతనిష్ఠలతోనూ తన దేహాన్ని శిక్షిం చడం మొదలెట్టింది. ఆ పల్లెలో నాకేం తోస్తుంది ? రాజ లక్ష్మి జపతపాలతో కాలం వెళ్ళబుచ్చుతుంది ! నాకా !

ఈ ప్రపంచమంతా ఒక వూసరక్షేత్రం. ప్రేమభిక్షకూడా చేతులుచాచి అడగలేనంత స్వాభిమానం నాది. ఎన్ని రాత్రులు కన్నీళ్ళతో నాపక్క తడిసిందో! బాధ పంచుకొనేవాళ్ళు లేనిచోట ఎంతకాలం వుండగలం? మళ్ళీ బర్మా పోనా?

ఎట్టకేలకు గంగామాటీకి స్వస్తిచెప్పాం. ఇద్దరం చెరో వైపుగా ఒకరు కాశీ, మరొకరు కలకత్తా వెళ్ళిపోయాం. దీక్ష స్వీకరించేందుకు రాజలక్ష్మి కాశీలోవున్న తమ గురువుల సన్నిధికి వెళ్ళింది. నేను యథాప్రకారంగా సత్రపు భోజనం—మఠానిద్రా.

రాజలక్ష్మి మీద నా ఆశలు తీరిపోయాయి. ఆమె ముక్తి మార్గానికి నేను అడ్డు నుంచోకూడదనుకొని, తెరవెనక్కి తప్పుకున్నాను ఈలోగా నాకో పెళ్ళి సంబంధం వచ్చింది. ఆ బంకమన్ను వొదిలించుకునే వేళకి తలప్రాణం తోకకి వచ్చింది. గౌహార్ అనే ముసల్మాన్ మిత్రుడి సంపర్కంతో గోసాయి మఠంలో పాదం పెట్టాను.

"కొత్త గోసాయీ, నిన్ను నేను బృందావనంలో చూశాను. గుర్తించ లేదూ," అంది కమలలత.

దగాపడిన నారీరత్నం కమలలత. బతుకు మతాబాలా వెలిగి పోడంతో ఈ మఠంలో చేరిందావిడ. ఆవైష్ణవి మనసు నామీద లగ్నం కావడానికి కారణాలు అనేకం వున్నట్టుండి నా విలువ యింత పెరిగి పోయిందేం చెప్మా!

"నా కథ వినవూ !" అంది సుశ్రావ్యంగా ఆమెకంఠంలో కోయిల దాక్కుంది. అందుకనే ఠాకూర్ జీ హారతి వేళప్పుడు ఆమె పాడేపాటకి యావన్మందీ అంత ముగ్ధులవుతారు.

నాదే చేంతాడంత కథ. ఇతరుల కథలువినే వోపికా, సానుభూతీ నాలో లేవు. అందువల్లనే రాజలక్ష్మికి అనేక తఫాలు కష్టం తోపించాను కూడా.

"అహం ఆరిపోని రెల్లుమంట లాటిది, కొత్త గోసాయీ ! నిన్ను అనుమానంతో వుండిపోనిస్తానా! నా చరిత్ర నీకు వినిపించి తీరుతాను." వైష్ణవి తన కథ లాలిత్యం తొణికిసలాడేటట్లు చెప్పింది. ఆమె పదిహేడోయేట వితంతువు కాగా, తండ్రి దగ్గిర గుమాస్తా చనువు చేసుకుని, ఆమెకి నాలుగోనెల గర్భిణీ అని పొక్కగానే, యిరవై వేలిస్తేగాని పెళ్ళాడనని కమలలత తండ్రి మీద సవాల్ చేశాడు. నాకు ఆ వివరాలు అనవసరం. కమలలత యిట్టే చూస్తూవుండగా నా హృదయాన్నాక్రమించింది. ఏనాడూ సూర్యోదయం చూసి ఎరగనివాణ్ణి, తెల్లవారు జామునే లేచి ఆమెతో పూజా ప్రసూనాలు కోసేవాణ్ణి.

బుద్ధిలోనూ మాట పొందికలో స్వభావ నైపుణిలోనూ కమలలత, ఎదిగిన మనిషి. అంటుందో నాడు : 'యదార్థం వుండవలసిన చోటుని అనృతం ఏనాడూ ఆక్రమించ లేదు. ప్రేమ స్వభావంలో స్త్రీ పురుషులకి ఎంతో వ్యత్యాసం వుంది. మీకు ఆధిక్యం కావాలి, మాకు గాంభీర్యం కావాలి;

మీకు ఆనందం, మాకు స్థిరత్వం.' ఒక రకంగా కమలలత నన్ను మార్చేసింది. పాము కుబుసంలా కొన్ని పొరలు నానుంచి విడిపోయాయి.

కలకత్తా చేరేవేళకి రాజలక్ష్మి ప్రత్యక్షం. ఓడిపోయిన దావా అపీలు చేసుకోడానికి వచ్చిందట. రాజలక్ష్మి కూడా గోసాయి మఠానికి వచ్చింది. ఇద్దరూ అయిదు నిముషాల్లో ఆప్తులై పోయారు. కమలలత వైష్ణవ కవితా హృదయం లోని ఒక అశ్రుగీతం. గౌహర్ మరణంతో కమలలత బికారిణై, బృందావన యాత్రాభిలాషతో, నన్ను రాజ లక్ష్మి చేతులోపెట్టి, తను, అదిగో ఆకనిపించే రైలుమీదనే, రాసక్రీడలు చూసేందుకు వ్రేపల్లె వైపుగా పోతోంది.

---

# లానీ

1938 నాటికి యూరప్ అంతా ఒక మందుగుండుకొట్టు. ఎవరు అగ్గిపుల్ల వెలిగిస్తారా అనేదే ప్రశ్న. ఒక జాతిమీద మరో జాతికి అకారణ అవిశ్వాసం. పారిస్ పట్టణంలో నాజీ వేటగాళ్ళు బంగారంతో పై అంతస్తు మనుషుల్ని వెల కాకీన కొనేస్తున్నారు.

లానీ, ఎవరితను ? ఒక అమెరికన్. సిరికుమారులు—అంటే లక్షలు మూలుగుతూవున్న భాగ్యవంతుల—మనిషి. అతని కుటుంబీకుల వ్యాపారం తుపాకీ నిర్మాణం. తండ్రి రాబీకి విమాన కర్మాగారం వుంది. రాబీకి రెండో ప్రపంచ సంగ్రామం అనివార్యమనీ, అందులో జయాపజయాల నిర్ణయాధికారం విమాన బలాధిక్యతనీ. గ్రహించగలిగిన ముందుచూపు వుంది. కాని మాజినో శ్రేణి దుర్భేద్యమని మురుస్తున్న ఫ్రెంచి ప్రజలకీ, ఇత్తడి బుర్రల ద్వీపవాసులకీ బడ్ ఎర్లింగ్ ఏరోప్లేనుల ఘనత ఏం తెలిసి ఛస్తుంది ! రాబీకి మతమనేది లేదు; అతను నక్షత్రాలవంక ఏనాడూ చూసిన పాపానపోలేదు; జననమరణాలలోని సృష్టి వైచిత్ర్యం అతన్ని పొరబాటునకూడా యిబ్బంది పెట్టను. అతనికి కావలసిందల్లా ఫాక్టరీ రాత్రింబవళ్ళూ పనిచెయ్యడం, విమానాలు వందలకొద్దీ గబగబా అమ్మకం కావడం, పెద్దపెద్ద

కర్మాగారాలు దేశీయం చెయ్యాలనే 'రెడ్స్' అతని దృష్టిలో దారులు కొల్లగొట్టే బందిపోటులు.

రాబీ తెగవారు కోటీశ్వరులు. నిజమైన పాలకులు వారు. వారికి కావలసింది వ్యాపారం. వ్యాపారం ముందు సమస్త నైతిక విలువలూ తృణప్రాయంగా చూడగలరు. స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం, సమానత్వం వగైరా మాటలు ఓట్లపండగ సందర్భంలో వాడే ఛెళుకులు. వారి దృష్టిలో దేశానికికూడా విలవలేదు. మిగతా భాగ్యవంతులతో బాటు Statusauo నిలబెట్టడానికి స్వదేశాన్నికూడా అమ్మజూపుతారు. 'క్లయివ్ డెన్ సెట్' బాపతు యిదే.

రాబీగానీ, అతని వర్గానికి చెందిన మరో కోటీశ్వరుడుగానీ ఘట్టిగా నల్లినిగూడా నలపరు, వాళ్ళకారణంగా సంభవమయే హత్యలు లక్షలమీద (యుద్ధాలు) జరుగుతాయి. పాపభీతి వారి అంతరాంతరాలలోకూడా చొరబడదు. వారు సాగించే హత్యాకాండకి సాంప్రదాయమూ దర్జా, న్యాయమూ అంటగడ్తారు. నాగరికత ప్రబలడంవల్ల, బానిసల్ని కొరడాలతో కొట్టడం మానేసి, న్యాయసూత్రాలనే వుక్కుతీగెల మధ్య వుక్కిరి బిక్కిరి చేసి గిలగిలా కొట్టుకునేటట్టు చేస్తున్నాం.

కాలావసరాల ఫలితంగానో, వ్యక్తిలక్షణ కారణంగానో లానీ సిరికుమారుల తెగకి భిన్నుడయాడు. అతనూ దంతపు గోపురంలో బతికేవాడే. జీవితాన్ని తాకిన అయిదుగురు

స్త్రీలూ, తనచుట్టూ మసిలే మనుషుల్లోని అసత్యప్రవర్తనా, రెండు పాయలుగా విడిన తన జీవితమూ అతని అశాంతికి పునాదు లవుతాయి. లానీ తన మనసువిప్పి ఎవరితోనూ మాట్లాడలేదు. ఎవరికి ఏమాదిరి సంభాషణ అనుకూలంగా వుంటుందో అదే మాట్లాడాలి. అతను ప్రెసిడెంషల్ ఏజంటు—రూజ్‌వెల్టు మనిషి. ఎవరికీ తెలియకూడని పరమ రహస్యం అది. లోకవ్యవహార రీత్యా అతను బొమ్మల వ్యాపారస్తుడు. హిట్లర్‌కీ, గోరింగ్‌కీ బొమ్మలు కొనిపెట్టే వాడు — వారి దగ్గరవున్న మహత్తర చిత్రాలు మిగతా లోకానికి అమ్మేవాడు. ఆపైకం నాజీ నాయకులపేర అమెరికన్ బాంకులలో డిపాజిట్ చేయించేవాడు. పారిస్, లండన్, బర్లిన్, జెనీవా నగరాలలో లానీ బడ్ చిత్రకళా వ్యాపారిగా నలుగురి నోళ్ళలోనూ పడ్డాడు. రాజకీయాలగురించిన చర్చ వచ్చినపుడు యితరుల అభిప్రాయాలు జాగర్తగా మననం చేసుకొని, తను మాత్రం చిత్రకళా వ్యాపారినని సాకుచెప్పూ, విలవైన ఏమాటా పొరబాటున కూడా దొర్లకుండా నడుచుకునేవాడు. ఎప్పుడూ పై తరహా మనుషులతోనే అతని కాలక్షేపం.

ఒక తఫా తండ్రీ కొడుకు లిద్దరూ బెర్లిన్ వెళ్ళారు. ధర వలన బేరసారంలో కాస్త కుస్తీ జరిగిన తరువాత రాబీ (అమెరికన్) గోరింగ్‌కి (నాజీ జర్మనీకి) విమానా లమ్మడానికి అంగీకరించాడు. సూపర్ ఛార్జర్ అనేది విమానవేగాన్ని

వృద్ధి చేస్తుంది. దాని నిర్మాణం రాబీ కర్మాగారానికి తెలీదు. అంచేత దాన్ని ఏదోవిధంగా తస్కరించి అమెరికాకి జేర వేయించమని కొడుకుని ప్రాధేయపూర్వకంగా అడిగాడు రాబీ.

నాజీ జర్మనీలో గెస్టాపో (పోలీసు శాఖ) ఎలా వుండేదో అదే ప్రకారంగా నాజీపాలనకి తలవొగ్గని అండర్ గ్రవుండ్ (విప్లవశాఖ) కూడా వుండేది. ప్రభుత్వాలని కూలదోయడం యూరప్‌లో అనాదిసిద్ధంగా వస్తూవున్న ఆచారం. ఆ ఆచారానికి అంతోయింతో పరాయిప్రజకూడా సాయపడుతూ వుండేవారు. మాంక్ అనే విప్లవకారికి లానీతో జోస్తీ. లానీ అతనికి చాలా ధనసహాయం చేస్తూ వుండేవాడు. రూజ్‌వెల్టు మనిషిగా–తను సమస్తమూ అవగాహన చేసుకోవాలి. విప్లవశాఖకి ఏభై వేల డాలర్లు (దొంగతనానికి బహుమతి) వస్తుంది కదా అని మాంక్, నాజీల కళ్ళలో దుమ్ము పోసి సూపర్ ఛార్జర్ అమెరికా చేర్చాడు.

లానీ బెర్లిన్‌లో వుంటుండగా ఒక మధ్యాహ్నం నాజీ సత్రంలో మకాం చేస్తున్న లారెల్ అనే అమెరికన్ పిల్లని కలుసుకున్నాడు. లారెల్ మంచి తెలివిగల పిల్ల.

"వెన కెప్పుడో తటస్థపడ్డాం—కాని ఎక్కువసేపు మాట్లాడుకునేందుకు టైము లేకపోయింది" అన్నాడు లానీ.

"అవును—మీా రిక్కడ ఏంచేస్తున్నట్లు. చిత్రకళా వ్యాపారమేనా!" అంది లారెల్.

"అవును. మీరేం చేస్తున్నారు?"

"కథలు. ఈనెల బ్లాక్‌బుక్ చూశారా? అందులో నా 'కొండమనిషి' వుంది."

" 'కొండమనిషి' అనగా?"

"కొండ గుహలలో దాక్కునే ఆటవికులు—బర్బరులు; ఈనాటి పెట్టిబడిదారులు—Troglodytes'."

బాణాలెట్లో లానీకి తెలిసింది. కాని అసిధారావ్రతమైన తన జీవితంలో అయినప్పుడూ కానప్పుడూ నవ్వే నేర్పరితనం బాగా అలవరచుకున్నాడు.

"మీరు నాజీ నరకంలో వుంటున్నారు. నాతో అన్నారు గాని అందరితో మనసులో మాట దూకుడుగా అనకండి. గోడలకి చెవులు (dictaphones) వున్న సంగతి మీకు తెలీదనుకుంటాను. జాగ్రత్త" అని వారించాడు లానీ. కాని వూహా జనితమైన ప్రపంచంలో మాత్రమే పరిచయమున్న లారెల్ అతని సలహాని భాగ్యవంతుల బెదిరింపుగా భావించింది.

లానీ మనసులో లారెల్ 'చిన్నచోటు చేసుకుంది. తన జీవితచక్రం లారెల్ జీవిత చక్రం ఎక్కడ కలుసుకుంటాయి? అవి Intersect అవనే అవవా? అయినా, గృహమూ గృహిణీ తన శక్తికి మించిన బరువులు కదా–ఎవరికీ తెలపకూడని రహస్యాలతో తన గుండె కుంగిపోతోంది. లారెలా? ఎందుకు? మొదటిభార్య యిర్మా ఇంగ్లీషు ప్రభువుని పెండ్లాడి

హాయిగా వుంది. వెనకటి తప్పేనా తెలిసి? వొద్దు. క్షణ కాలం వ్యవధిలేని జీవితంలో సహచారిణికి స్థానం వుందా?

నిజీ సిద్ధాంత ప్రకారం లాసీ చాలా వుపద్రవమైన జీవితం గడుపుతున్నాడు. తను గూఢచారిఅని గెస్టాపోకి ఏమాత్రం ఆచూకీ దొరికినా ఆటకట్టు అయిపోతుంది. ప్రతి క్షణమూ, ప్రతికదలికా తన పాలిట ప్రమాద భూయిష్ఠమైనవే! హిట్లర్, గోరింగ్, గోబెల్స్, హిమ్లర్, హెస్, రిబ్బన్ ట్రాప్—వీరందరూ అతనికి ఆప్తులు, మిగతా దేశాల లోని పెయింటింగ్సుగురించీ, రాజకీయ వాతావరణంగురించీ వారితో బాతాఖానీ కొడుతూవుండేవాడు. కొండలమధ్య వున్న కట్టడంలో కూచుని హిట్లర్ ఒకనాడు అన్నాడు లాసీతో; 'అయితే, బ్రదర్, ఇంగ్లండూ ఫ్రాన్సా మామీద విరుచుకు పడతాయంటావా—డాన్‌జిగ్ రీచ్‌లో కలుపుకున్నంత మాత్రాన?''

"ఆఁ. ఎంతమాత్రం పడవు. ఇంగ్లండులోనూ ఫ్రాన్సులోనూ మనమీద వాత్సల్యంవున్న వారే పాలన సాగిస్తున్నారు. 'క్లయివ్ డెన్ సెట్' (బ్రిటిష్ భాగ్యవంతులు) కి మనమంటే తగని మమకారం, ఫ్రాన్సు అంతఃకలహాలతో జీర్ణిస్తోంది. ఇంగ్లండులో చాంబర్లీనేగా... అందరూ వ్యాకుల బడుతున్నది ఎర్ర ఎలుగుబంటి విషయంలో'' అని లాసీ ఓదార్చు.

"అవునవును. జర్మన్ విమానబలాన్ని మించిన ఆయుధం ప్రపంచంలో లేదు'' అన్నాడు సగం మానవాతీతుడూ

సగం పిచ్చివాడూ ఐన హిట్లర్. చిన్నతనంలో అతను అనుభవించిన యాతనలకి యూరప్ప్రపంచం సమాధానం చెప్పవలసిన రోజులు దగ్గర్లో పడ్డాయి. అతని కష్ట పరంపరాస్మృతి వ్యక్తావ్యక్తంలోపడి లోకాన్ని రాక్షసశక్తితో గజగజలాడిస్తోంది. నాజీ నాయకులు వింతమృగాలు. ఆ సర్కస్ నడిపించే మేనేజర్ హిట్లర్. మేనేజరు చెప్పుచేతల్లో సింహాలూ, పెద్దపులులూ నడుచుకున్నట్లే నాజీనాయకులు హిట్లర్ అడుగుజాడల ననుసరించి ప్రవర్తిస్తున్నారు.

అన్నాడు హిట్లర్ లాసీతో. "ప్రపంచమంతటా అపనమ్మకం, దగా, నిజమేదో, అబద్ధమేదో తెలుసుకునే పాటి వీలుండటంలేదు. ఈ నాటి అబద్ధం రేపటికి ఆవశ్యకతవల్ల నిజమవుతోంది. నేను ప్రజల మనిషిని, రాజకీయ దురంధరుల కుయుక్తులు నాకు తెలియవు. పాలిష్ ప్రజని బ్రిటనూ ఫ్రాన్సూ చదరంగపుటాటలోని పావులలా వుపయోగిస్తున్నాయి. నేను వారిజోలికి పోక పూర్వమే నామీద విద్వేష ప్రచారం సాగిస్తున్నారు."

లాసీకి కొత్త కదలికలు అర్థమయాయి. పోలెండు ఆయుర్దాయం—జకోస్లోవేకియాకి మల్లేనే—మూడింది. లాసీ మొదటి ప్రపంచయుద్ధాన్ని చూశాడు. ఆ బెదురునుంచి తన తరంవారు యింకా తేరుకోక పూర్వమే, రెండో దానికి అలారం గంట మోగింది. వార్సెయిల్సు సంధి దినాల్లోని అతని కార్యక్రమం అంతా జ్ఞప్తికివచ్చింది. యూరప్ పేచీల

నుంచి అమెరికా తప్పుకోవటమే కొత్త ఉపద్రవానికి వీలిచ్చిందేమో! లాంటి ఒక సామాన్యవ్యక్తి. హృదయం బుద్ధి వున్నాయి. కనక శోధనా దృష్టితో ఆత్మపరిశీలన చేసుకోగలడుగాని చరిత్రగమనాన్ని తన యిష్టప్రకారం తిప్పలేడు కదా! త్వరలో జరుగబోయే యాగానికి తనొక ఆహ్వానితుడు—అంతే! రూజ్‌వెల్టుకి తన డ్యూటీ ప్రకారం హిట్లర్ మన స్థితి యావత్తూ తెలియజేశాడు.

అమెరికను గవర్నమెంటులో నిముషాలమీద ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. యూరోపా రాజకీయాలలో అమెరికా పైకి తటస్థంగా కనిపించినా లోలోపల కూడుపుతాసి సాగిస్తోంది. అమెరికా నిండా నాజీలు నలుమూలలా అల్లుకుపోయి వుండటం వల్ల, పబ్లిగ్గా ఏమాటా బైటికి వచ్చేది కాదు. గోరింగ్ కోసం హుషారుగా విమానాలు తయారుచేస్తున్న రాబీబడ్ దగ్గిరకి ఒక మిలటరీ ఆఫీసరు వచ్చి 'ఎగుమతుల కింక ప్రభుత్వం అనుమతి యివ్వదు. విమానాలు మన రక్షణకి కావాలి' అన్నాడు.

"ఇన్నాళ్ళూ మీరు నా మొహం చూడలేదు, ఫాక్టరీలో మరలన్నీ తుప్పుపట్టాయి, తీరా అమ్ముకునే వేళకి అడ్డుపుడక వేస్తే ఎలా?"

"అలా కాదు, మిస్టర్ బడ్, మీరు చెయ్యగలిగినన్ని ప్లేనులూ గవర్నమెంటే మీదగ్గిర కొంటుంది."

"గోరింగ్ వొప్పుకున్న ధర యివ్వాలి."

"అలాగే."

రాబీ బడ్‌కి ఈ వ్యవహారం అంతా చిక్క లేదు. రూజ్‌వెల్టు ప్రభుత్వం తన పక్కన యిన్ని విమానాలు ఎందుకు ఖరీదు చేస్తున్నట్టు... ఏం చేసుకుంటారు వాటి నన్నిటిని? మిలిటరీ ఆఫీసరుని కాస్త కదిపాడు.

"అమెరికా ఈ యుద్ధంలో కలగచేసుకోడం నా కెంత మాత్రం యిష్టంలేదు."

"ప్రపంచశాంతిస్థాపన అమెరికా తలకి చుట్టుకుంది. 'మీరు సాయం చెయ్యకపోతే యిరవైనాలుగు గంటలలో బ్రిటిష్ నౌకాదళం అంతా జర్మనుల పరంచేస్తున్నాం' అని బ్రిటనంటే అమెరికా ఏంచెయ్యాలి?"

రాబీబడ్ విస్తుపోయాడు. అవును. అదే అందరూ లోలోన గొణుక్కుంటున్న చిదంబర రహస్యం. ఈలోగా లానీ ఒకసారి అమెరికా వచ్చి రూజ్‌వెల్టుకి కొన్ని సంగతులు ముఖాముఖీగా విడమర్చి చెప్పి, తిరిగి యూరప్ వెళ్ళిపోయాడు. లానీ బెర్లినులో వుండగా లారెల్ దగ్గరనుంచి తను గెస్టాపో సాలిగూట్లో యిరుక్కున్నాననీ, రక్షించమనీ ఒక టెలిఫోన్ కాల్. ఆమెను స్విట్జర్లాండు చేర్చేటప్పటికి లానీకి తలప్రాణం తోకకి వచ్చింది.

లానీ ఫ్రాన్సు వచ్చాడు. రేపో నేడో యుద్ధం ప్రారంభం కావచ్చునని ప్రజానీకం అల్లల్లాడి పోతోంది. ఫ్రెంచి పత్రి

కలు అంటకి పూర్వమే 'అసత్యాల యుద్ధం' జర్మనీమీద లేవదీశాయి. రైలు స్టేషనుల నిండా సోల్జరులు. కాని, వాళ్ళ మొహాలు కళాకాంతులు లేకుండా వున్నాయి. పాతికేళ్ళ కిందట సైనికులు పొలోమని పాటలు పాడుకుంటూ ఉత్సాహంతో యుద్ధభూమిలోకి నవజీవన నిర్మాతల్లా దూకడం లానీకి జ్ఞాపకంవుంది. కాని యీనాడు వాళ్ళ మొహంలోనూ ఉత్సాహం లేదు. ఇష్టాయిష్టాలతో ప్రసక్తి లేకుండా కడుపాకలికోసం ఫాక్టరీలో పనిచేసే కూలీల వలె నిస్తేజంగా కనిపించారు—తరలిపోతున్న యీ యుద్ధ వీరులు. లానీకి ఈ మార్పు వింతగా తోచింది. 'హిట్లరుకి ఏం కావాలి?' అనే ప్రశ్న ప్రతి మొహంలోనూ తాండవిస్తోంది. మానవ రక్తమాంసాల రుచి మరిగిన సింహం కొసదాకా వదలదని ఈ గొర్రెల కేం తెలుసు?

రణభేరి మోగింది. వార్సానగరం జర్మను విమానాల ధాక తెలుసుకుంటోంది. లానీ ఫ్రాన్సునుంచి యింగ్లండు వెళ్ళాడు. అక్కడనుంచి 'క్లిప్పర్' మీద అమెరికా చేరుకొని రూజ్‌వెల్టుకి తన నివేదిక అందించాడు. తిరిగి లండన్ వచ్చేనాటికి యింగ్లండు గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. లండన్ పట్టణమంతా శతఘ్నులతోనూ, బెలూనలతోనూ నిండివుంది. ప్రజలు యుద్ధం గురించి తీవ్ర వాదోపవాదాలు సలుపుతున్నారు.

ఒక ఆంగ్లేయుడు అన్నాడు లాసీతో, 'నియంతృత్వానికీ ప్రజాస్వామ్యానికీ మధ్య అఖాతం వుంది. ప్రజాస్వామ్యంలో ప్రజలకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వున్నాయి.'

లాసీ జవాబు చెప్పాడు. 'నాజీలు తమకు స్వాతంత్ర్యం లేదని నిద్రలోకూడా పొరబడటంలేదు, భాయీ. వారి విశ్వాసమూ, లక్ష్యమూ జర్మనీ భవిష్యత్‌లో. నీకు యింగ్లండు ఎలాంటిదో వారికి జర్మనీకూడా అంతేగా! పైగా మీ నాయకులమీద మీకు నమ్మకంలేదు, కాని వారి నాయకులపట్ల వారికి గురి వుంది.''

''వారి నాయకులు జూటాకోర్లని రుజువు చేస్తాం.''

లాసీ తనలో తను నవ్వుకున్నాడు. చరిత్ర నిరూపించ వలసిన సత్యాల్లో అది ఒకటి. బ్రిటన్ పడుతున్న తాప త్రయమంతా రష్యా జర్మనీలు డీకీకొట్టుకోవాలని. మిగతా వన్నీ ఒట్టి ఖబుర్లు—పత్రికలవాళ్ళూ, లోగుట్టు తెలీని అమాయకులూ పేలే పేలాపన.

ఒక్కరోజులో రాటర్‌డామ్ శిథిలం అయిపోయింది. జర్మన్ పాంజర్ డివిజన్ పాశుపతాస్త్రంలా ముందుకు దూసుకుపోతోంది. దాని ధృతాన్ని ఎదిరించగలిగిన సత్తువ ఏ దేశానికీ లేదు.

నార్వే, బెల్జియం, హాలెండ్, డెన్మార్క్—సీమ టపా కాయులలా రాజ్యాలు పేలిపోతున్నాయి. జర్మన్ బలగం ప్రగల్భాలమాజినో దాపుకివచ్చింది. పాత తుపాకీలకి నూనె

పట్టిస్తున్న ఫ్రెంచివారి కాళ్ళూ చేతులూ చల్లబడ్డాయి. లాసికి అంతా తెలుసు. వెనక హిట్లర్ ఈ కార్యక్రమమంతా తనతో అనే వున్నారు.

నవరంధ్రాలూ బిగించి యజ్ఞ పశువులుగా చేశాడు హిట్లర్ మిత్రబలాల్ని డన్‌కిర్క్‌లో. తొమ్మిది పాంజర్ డివిజన్లు (డివిజనునికి నాలుగు వందల టాంకులు—దానికి తగిన విమానబలం) మధ్య యిరుక్కుని పది లక్షల ఫ్రెంచి బ్రిటిష్ పటాలాలు ఫ్రాన్సునుంచి వేరుబడి నిరాధారంగా శత్రువుచేతికి చిక్కాయి. డన్‌కిర్క్ అవమానం బ్రిటిష్ ప్రజలలో పౌరుషంగా రేకెత్తింది. డన్‌కిర్క్‌లో నాజీలు దయాదాక్షిణ్యాలు లేకుండా హాస్పిటల్ వోడల్నికూడా ముంచేశారు. మిత్రుల రక్తం వరదలై పారింది. బ్రిటన్ తన సేనల్ని సాధ్యమైనంత పొదుపుతో వుపసంహరించుకుంది.

మేఘాల్లా విమాన పంక్తులు పారిస్ మీద దాడి సల్పాయి. 'హా లక్ష్మణా' అంటూ ఫ్రెంచి ప్రభుత్వం అమెరికాతో మొర పెట్టుకుంది. జర్మన్ ధాటికి మాజినో పేకమేడలా కూలిపోయింది. ఏ ప్రదేశాలలో అయితే మిత్రులు జర్మనీ చేత 1918 లో సంధి పత్రంమీద సంతకం పెట్టించారో, అదే ప్రదేశంలో ఫ్రెంచి ప్రధాని జర్మన్ సంధిపత్రంమీద చేవ్రాలు పెట్టాడు.

విజేత హిట్లర్ పారిస్‌లోని నెపోలియన్ గోరీ పరిశీలనగా చూస్తూ అనుకున్నాడు. 'సామ్రాట్, నీ కలకి నేను ఆకృతి

కల్పించాను. యూరప్ అంతా ఒకే పాలన కిందకి తీసుకు వస్తున్నాను. నీ పొరపాట్లు నేను చెయ్యను. మహమ్మద్ ప్రవక్త మనకి ఆదర్శ పురుషుడు—యంత్ర నాగరికతకి అనుకూలంగా వుండే పాలనా సూత్రాలు—అర్థమం వెయ్యేళ్ళయినా వర్ధిల్లే రాజ్యాంగవిధానం—నిర్మిస్తాను. మహోన్నతుడనైన నెపోలియన్ చక్రవర్తీ, నీ శ్రమ వృధా కాలేదు. నీ ఆత్మశాంతికి ప్రార్థిస్తున్నాను.'

పైకి హిట్లర్‌ని అభినందిస్తూ, 'మానవుడేనాటికైనా నాయకుణ్ణి విస్మరించి తనకి తాను ఆలోచించుకోగలడా? శిలారూప చిహ్నంగావున్న ఈ కీర్తికోసం ఎన్నిలక్షలపుత్రులు బలిపెట్టావ్ నెపోలియన్' అని ప్రశ్నించుకున్నాడు లానీ.

# పూర్వకథ

పీకింగ్ పట్టణంలోని [illegible] నాలుగో లియు. [illegible] లియు తన హైరానపడ్డే దినాల్లో చేయని ఘనకార్యం లేదు. ఖజానా నాకరుగా పరిచేశాడు. జూదప్పుకొట్టు నడిపాడు. ఆడశరీరాల అమ్మకం కొనుబడి జోరుగా సాగించాడు. డబ్బు అప్పిచ్చి తడిగుడ్డలతో వాళ్ళ గొంతులకోశాడు. ఒకటేమిటి—అతను చెయ్యని—చెయ్యలేని పనిలేదు. వీధిగలాటాలలో నాయకుడుగానూ, పెద్ద కుటుంబాల్లోని అమ్మాయిల్ని తిరస్కరించడం విషయంలో అందెవేసిన చెయ్యిగానూ పేరుపడ్డాడు జైలు అతనికి అత్తారిల్లు. ఆ రోజుల్లో, రెండు మూడు దశలు గడిచేటప్పటికి దేశకాల పాత్రలు మారిపోయాయి. రిపబ్లిక్ ఏర్పాటవడంతో పోలీసు బందోబస్తు తీవ్రంకాగా, లియు చెలగాటం ఆటకట్టయింది. వీధిగలాటా నాయకుడి కాలం తీరిపోయిందని తెలుసుకుని, నాలుగో లియు తన డెబ్భయ్యోయేట రిక్షాషెడ్డు ఏర్పాటుచేశాడు. అతనికి కుడిభుజంగా—(ముప్ఫయ్యేడేళ్ళు వచ్చినా పెళ్ళీ పెడాకులూ లేని కూతురు)—పులిపిల్ల మసులుతూ, రిక్షా వ్యాపార సంబంధమైన సమస్త కార్యాలూ చక్కబెట్టేది. నాలుగో లియుతో లావాదేవీలు వున్న ప్రతి రిక్షావాడికీ పులిపిల్ల విధాయకంగా తెలిసివుంటుంది.

సుఖజీవి అలాంటి స్వాప్నికుల్లో ఒకడు. అతని ఏకైక జీవితాశ్రయం అద్దెరిక్షా కాక స్వంతరిక్షా లాక్కోవడం. రిక్షా ఖరీదు నూరు డాలర్లు. తనకెలా వస్తాయి నూరుడాలర్లు! శతసహస్ర స్వేదబిందువులలోనైనా తను రిక్షా కొనుక్కో గలడా? నరకంలో వుంచినా జాగ్రత్తగా నడుచుకునే గుణం అతనిది. లెఖ్క కట్టాడు, రోజుకి పదిసెంట్లు చొప్పున తను వెయ్యిరోజులు కూడబెడితే ఒక రిక్షా వొస్తుంది. సన్నగా డొక్కెండిన బుర్రలో మెదిలిన ఆ ఆలోచన మూడేళ్ళలో కందగడ్డలాంటి అతని ముఖంలో సంతోషరేఖ తెప్పించింది. బాడుగబాధ లేకుండా సుఖజీవి తన స్వంతరిక్షా విజయ గర్వంతో లాక్కుంటున్నాడు.

ఇష్టాయిష్టాలతో ప్రసక్తిలేకుండా మనని పలకరించే మహామ్మారులలో యుద్ధం ఒకటి. పట్టణమంతా పుకార్లతో వుడికిపోతోంది. 'అదిగో తోక అంటే యిదిగో పులి అంటున్నారు' భీతావహులైన ప్రజలు. పశ్చిమద్వారానికి వెలుపల రిక్షాలూ, బళ్లూ, కార్లూ అన్నీ సోల్జర్లు లాగేసుకుంటున్నారనీ, అల్లకల్లోలంగా వుందనీ, రెండురోజులుగా వింటున్నాడు సుఖజీవి. ఈ సంచలనం వల్ల కిరాయి ఒకటికి నాలుగురెట్లు అయింది.

''విద్యాపీఠానికి రెండు రిక్షాలు కావాలి'' ఇద్దరు విద్యార్థులు అడిగారు. సుఖజీవి రిక్షాపక్క మరి మూడు బళ్ళు వున్నాయి.

"[illegible]" అన్నారు [illegible].

ము[illegible] సుఖజీవిని తనకు [illegible] అక్కడ్నే సుఖజీవి వెనకవైపు వేస్తూనా—అదృష్టం! [illegible] రెండూ పశ్చిమ ద్వారం దాటి ప్రధానదారిని పోతున్నాయి. ఒక చిన్న సోల్జరుముఠా రెండు కార్లూ [illegible] సుఖజీవిని బందీగా చేశారు.

సుఖజీవి ఆశ నిరాశ అయిపోయింది. తన స్వర్ణ పేటికని-లక్షలకొలదీ చెమటబొట్లు కార్చి సంపాయించుకున్న అందాలబండిని-జీవిత సర్వస్వాన్ని-ముష్కరులు దొంగిలించారు. ఇంక తను బతికేం, చచ్చేం! చావే మేలు. సోల్జర్లు తనను చావనిస్తారా? ఖైదీని చేసి వారి వెంటతిప్పుతున్నారు. పీకింగ్ చూడాలని అతని కళ్ళు కాయలు కాచాయి. అక్కడ తల్లీ, తండ్రీ, బంధువూ, 'నా' అన్నవాళ్ళెవరూ లేరు. లేకపోయినా అది అతని స్వస్థలం. సుఖదుఃఖాలనుంచి కాపాడే మాతృభూమి. సుఖజీవి పీకింగ్ చేరాలని తహతహలాడి పోతున్నాడు.

అతన్ని ఖైదీగా పట్టుకున్న వాళ్ళు నిజానికి సోల్జర్లుకారు-దొంగలు. సోల్జరు వేషాలతో లూటీలు జరిపే ఘరానా దొంగలు. ఈ ఘరానాదొంగలకీ నిసలైన సోల్జర్లకీ ఒకానొక కొండచాటున అర్ధరాత్రి వేళ ఘర్షణ జరిగింది. అదను కనిపెట్టి సుఖజీవి చల్లగా తప్పుకున్నాడు. మూడు ఒంటెలు అతని పాలబడ్డాయి.

[illegible], [illegible], [illegible] వాసాలు, అతని పక్కని మూటలో మూడు జీవాలు వున్నాయి. జీవాలు—తనకి మళ్లీ ప్రాణం పోస్తే, ఆ విశాలమైన ప్రదేశంలో వాటిని ఎలా వదలగలడు? అదీగాక [illegible] ఈ ఘరానా దొంగలు అపహరించాడు. అందుకు ప్రత్యామ్నాయంగా మూడు ఒంటెలు – మబ్బులకెగసిన మహాదేవుడు – ప్రసాదించాడు. భగవద్విలాసం. పిల్లవాళ్లూ కొండకి ప్రదక్షిణ చేస్తూ సూర్యోదయం అయిన తర్వాత ఒంటెల్ని పక్కవూళ్లో బేరం పెట్టాను. [illegible] వాళ్లు కూడా రాలేదు. ఎంతకంతే-దొంగసొమ్ము! కాలే కడుపులో కాస్త గంజి పడగానే, మూతే కాళ్ళకి సత్తువ వచ్చింది. తిన్నగా పీకింగ్ పోయి నాలుగోలియు ఎదుట నిలబడ్డాడు 'ఒహో! వొచ్చావూ - బంగారపు గనులలో పని చెయ్యడానికి వెళ్ళావని విన్నానే!' అన్నాడు లియు. సుఖజీవి సమస్తమూ మనవిచేసి, మళ్ళీ బండి పుచ్చుకున్నాడు. వోరకంటితో వ్యవహారమంతా చూస్తున్న పులిపిల్ల కన్నుబడింది సుఖజీవిమీద.

వెన్ను వాల్చకుండా శ్రమించి మళ్ళీ తన రిక్షా తను కొనుక్కోవాలని సుఖజీవి అభిలాష. ఒక్క బేరం పోగొట్టుకునేవాడు కాదు. చకచక పరుగే కాని కాళ్ళకి ఒక్కక్షణం తీరికవుండేది కాదు. రక్తమాంసాలు కదా–సుఖజీవి శరీరం మాత్రం యినుమా? లియు, పులిపిల్లా అంత వెర్రితనం తగదని మాటిమాటికీ వారిస్తూ వుండేవారు, కాని సుఖజీవి లక్ష్యం నూరుడాలర్లు, ఎలా సంపాయించడం...

[illegible] కొలువుల్లో నిద్ర [illegible] ఉందని సుఖజీవి [illegible]. అయినా [illegible] తాకలసినంత వారధి [illegible]. ముక్కు [illegible]. ఆ ముక్కును పెళ్ళాలూ నౌకర్లని నోటికొచ్చినట్లు తిట్టుకుంటూ [illegible] చేసినోను ఏకీ భవించేవాడు కాదు. [illegible] లేక కొలువుకి సలాం చెప్పి తిరిగి తనకిష్ట [illegible] లకి పరిగెత్తు కొచ్చాడు.

నిశిరాత్రి అయింది. చలికి నక్షత్రాలు కూడా వణుకు తున్నాయి. సుఖజీవి బుర్ర ఎడారిశూన్యాన్ని పోలివుంది. మానవశూన్యతాపాలలోకి తన పసుపుచుట్ట చంకలో పెట్టు కొని ప్రవేశిస్తున్నాడు. అతనికి ఒకటికి పదిమాటలు చెప్పే స్వభావం కాకపోయినా, ఈ రాత్రి తన హృదయ శోకాన్ని ఆలకించేందుకు ఎవరైనా దొరికితే బావుండుననిపించింది. తన గుండెమంట వెయ్యి నాలుకలతో రోదిస్తోంది. ముఖమల్ దుస్తులలోవున్న పులిపిల్ల ద్రాక్షాపాత్ర చేతబుచ్చుకొని సుఖజీవిని చూసింది.

సుఖజీవి గమనించాడు. ఆమె తనమీదికి వురుకుతోంది. మాంఛి రుచిగావుండే రక్త మాంసాలమీద పులిపిల్లకి ఆపేక్ష సహజం కదా! అగ్నిద్రావకంలాంటి సముద్రతరంగాలలో తనని ముంచేసి, పీల్చి పిప్పిచేసి, బెరడుగా, ఎముకల పోగుగా పొద్దుకి గిరవాటు వేసే శక్తిరూపిణి ఆవిడ. తాటి ప్రమా ణంలో మీదికి లంఘిస్తూన్న ఆ కెరటంముందు అయిదడు

గుల సూచి, తన్ను తీ? యుగాలకాలకే పూర్వాకారం ఆ మోహినీ అవతారాన్ని. ఉద్రేకం చెలాయిస్తూ, సమస్తవ్యాపకమూ చేయించే పులిపిల్ల తన బాహుబంధంలో నలిగిపోతోంది. అతని శక్తికి ఒక ప్రస్థానమూ, అహానికి ఒక ద్వారమూ ఏర్పడ్డాయి. ఉష్ణ జ్వాలని. నక్షత్రంలా మెరిసే మిణుగురు, శీతాకాలం కడుపు కట్టిక పూర్వ్యా, ప్రియాలింగనంకోసం తహతహలాడి, అధ్యాయం చాలించింది.

తెల్లారిన తర్వాత ఎండ ముదిరినకొద్దీ, సుఖజీవి వేదన తీవ్రమయింది. పులిపిల్ల ఏ మొగాడితో అయినా యింతే నేమో! విరిగిన పాలన్నవిషయం తెలియనే తెలుస్తోంది. గాజుకప్పు బద్దలవగానే వీధిలోకి విసిరేసినట్లేనా? రాత్రి సంగతి మర్చిపోదామని మహా ప్రయత్నించాడు సుఖజీవి. కాని పులిపిల్ల కోరలు మరవడం సాధ్యమూ—ఆ యింగితం అతనికి లేదు గాని! సాలిగూట్లో యిరుక్కుంది పురుగు. ఏమీ లాభంలేదు. ఉన్నతికోసం పాకులాడటం వృధా యేమో అనుకున్నాడు సుఖజీవి. జీవితమే చక్రకాయ కాబోలు!

తన బతుకు తనకే వెగటుతోచి మానవశ్రావ్యతాశాల నుంచి పారిపోయి, మరోచోట కొలువుకి కుదిరాడు. ఈసారి యజమాని, కుటుంబం అంతా మంచివారే! తన ఆస్తి అయిన నలభై డాలర్లూ రాత్రింబవళ్ళూ మొలతాడులో దాచుకునేవాడు. రోజులు పసందుగా గడుస్తున్నాయి. యజ

మాని కదంశాన్ని గ్రహిస్తున్నాడు. అవన్నీగాడు కూడా దొడ్డ మనిషి. రెండేళ్ళపాటు యిలాగ కష్టపడి క్వాంటిటీ కొనుక్కుంటాడు.....మెడలోనున్న పూలు కావు, ఒక సాయంత్రం పులి పిల్ల తోటివాడుగాలి పడగొట్టుకొచ్చి తను కడుపుతో వున్నానని, చెప్పాలనుకుని ఆగిపోయాడు. పదివేల ఆలోచనలు అతని బుర్రలోకి జడజడా వచ్చాయి. పాలమధ్యలో ఫిలిం తెగింది. తెరమీద తెల్లదనమే సుఖజీవి మొహంలోనూను.

ఇంత కొంప మునుగుతుందని అతను ఏ నాడూ భావించ లేదు. అదీకాక ప్రతీపల్లె పొట్టి పత్తిలగూరి. నిజమెంతో అబద్ధమెంతో! క్వాంటిటీ కొనుక్కున్నాక తను పెళ్ళి చేసుకుందామనుకొన్నాడు. చెప్పినట్లు వినే స్వచ్ఛమైన పల్లెటూరి పిల్లని చేసుకుందామనుకున్నాడు. కాని యిలాటి మిగలపండిన ఫలాన్ని? సుఖజీవి బతుకు బతుకంతా కంపించింది. ఆ కంపరానికి వీధిలాంతర్లు తమ దైన్యత వెలి బుచ్చాయి.

సుఖజీవియజమానికి రాజకీయాలతో ప్రమేయం వుంది. అతన్ని ఒక డిటెక్టివ్ వెంబడించాడు యజమానిని పదిలంగా సురక్షిత స్థలానికి చేర్చిన సుఖజీవికీ మాయా డిటెక్టివ్‌కీ కాస్త పేచీ పొసిగింది.

"అబ్బాయ్——నేను బీదవాణ్ణి, డబ్బులేనివాణ్ణి, భార్యా బిడ్డలకోసం యీ వృత్తి చేస్తున్నాను. నీదగ్గర ఎంత డబ్బుందో అంతా యిలా పారేసి నీప్రాణాన్ని కొనుక్కో. సుఖజీవీ!

సుఖమనేది నాగ్రికుల్లో వున్నవాళ్లకే మనుషులకి. నువ్వూ నేనూ ఎలకలం—పందులం. మన ప్రాణానికి విలవ లేదు. గుండు దెబ్బకో అన్నా, ఎలకని పాకెట్ల్లోకి విసిరేస్తారు-పందిని కోసుకుతినేస్తారు. సిగ్గుగా వున్న ఆ పైకం ఇటు పారేసి స్వేచ్ఛ కొనుక్కో—లేదా పిల్లల 'హాం' అంటుంది,'' అన్నాడు డిటెక్టివ్. చెమటోక్కు కూడబెట్టిన నలభై డాలర్లూ ఆ డిటెక్టివ్ చేతుల్లో పోస్తున్నప్పుడు సుఖజీవి కళ్ళనుంచి కారినవి కన్నీళ్ళు కాదు రక్తాశ్రువులు.

పులిపిల్ల సుఖజీవిని మభ్యపెట్టి వెళ్ళాడింది. లియు యిద్దర్నీ తరిమేశారు. ఈసారి నిజంగా కడుపువచ్చింది. వాళ్ళ పక్కవాటాలో మెరుపుదీపం అనే పిల్లవుంది. మెరుపు దీపానికి పదహారోఏడు రాగానే దాన్ని ఒక ఆర్మీ ఆఫీసరుకు అమ్మాడు వాళ్ళబాబు. ఆ ఆఫీసరు ప్రతి కాంపులోనూ ఒక కన్నెపిల్లని కొనుక్కుని, బదిలీ అవగానే అక్కడ వొది లేసి వెళ్ళిపోతూ వుండటం మామూలు. అతనికి బదిలీ అవడంతో బాబు యిల్లు చేరుకుంది ఆ అమ్మాయి. 'ఏం చేస్తావు? అమ్మ లేదు—నీయిద్దరి తమ్ముళ్ళనీ పోషించాలి గదా—నేను సంపాయించే రిక్షాకూలీ నా పొట్టకే చాలదు. వయసులో వున్నదానివి—'అదీ బాబు హితవు. అతిథుల్ని యథోచితంగా సత్కరించి తృణమో పణమో ఆర్జించి కుటుంబపోషణ చేసేది మెరుపుదీపం. పులిపిల్లకి ఆమె అంటే ప్రాణం.

గర్భం దాల్చినప్పటినుంచీ తెగమింగి పులిపిల్ల దున్న పోతులా బలిసింది. ఆమె బతుకు తాళమూ లయూ లేని ఒక గేయపాట. ముసలి తండ్రిని వదలినందుకూ, తను దారిద్ర్యంలో మగ్గుతున్నందుకూ, సుఖజీవికి రిక్షా లాగడం మినహా మరోధ్యాస లేనందుకూ ఆమె కించిత్తయినా వ్యాకులత పడేదికాదు. తొమ్మిది నెలలూ నిండాయి— నొప్పులు ఆరంభ మయాయి. పెద్దనయములో తొలికాన్పు. మూడురోజులు యమయాతన అనుభవించి, ఒక మృతశిశువుని ప్రసవించి, పులిపిల్ల కళ్ళు తేలేసింది.

ఇంటిది కాలం చేసింది, రాగిదమ్మిడీ తన దగ్గిర లేదు. లోకం చూడటానికి మొహం చెల్లదు. సుఖజీవికి ఏమీ పాలుపోవడం లేదు. ఏ నేరానికి విధి తనను యిలా శిక్షిస్తోంది ? శత సహస్ర స్వేదబిందువులతో కొనుక్కున్న రిక్షా పోల్జర్లు అపహరించారు. కూడబెట్టిన నలభై డాలర్లు డిటెక్టివ్ బెదిరించి లాక్కున్నాడు. తను వజ్రకాయుడనని మురిపాన్ని పులిపిల్ల ధ్వంసంచేసింది. బాడుగ బాధ లేకుండా స్వంతరిక్షా లాక్కునే అదృష్టం ఈ జన్మకి లేనేలేదా ! మృతకళేబరం ప్రక్కని కూచుని బీడీ వెంట బీడీ ముట్టిస్తున్నాడు.

"అన్నా. బాధలకోసమే బతుకు," అంది మెరుపు దీపం, పక్కగదిలోనుంచి వచ్చి. ఋజు మార్గాన్నిపోయే రిక్షాబాయ్ కంటె, స్త్రీత్వపు విలువ, కనిపించని కంటి ముత్యాల దొంతరలో గ్రహించిన మెరుపు దీపానికి, జీవితంలోని అగాధాలు బాగా అనుభవ మయాయి. పెద్దపెద్ద

భవంతులలోవున్న వారి కామకలాపాలు ప్రేమప్రసూనాలగా పరిణమిస్తాయిగాని ఈ మురికికొంపలో మండే కడుపుల మధ్య ఎలా? నాలుగు డబ్బులు సంపాయించిన తర్వాత మెరుపుదీపాన్ని తను అట్టిపెట్టుకుందామని అనుకుంటూ, సుఖజీవి నడివీధిలోకి వచ్చాడు. కూతురు లేచిపోవడంతో మానవశ్రావ్యతా శాలిని అమ్మేశాడు అక్కడ లియు.

ఈసారి కుదిరిన కొలువులో ఒక అవకతవక పని చేసి, వున్న కాస్త ఆరోగ్యాన్నీ బూడిదపాలు చేసుకున్నాడు సుఖజీవి. కాళ్ళలో మునుపటి దారుఢ్యం లేదు. 'ఒంటె' (సుఖజీవి వుడుకు పేరు—వెనక మూడు ఒంటెలు వెంటవేసు కొచ్చిన కథ అందరికీ చెప్పాడు) గమనోద్వేగం నీరసించింది. పొట్టపోసుకునేందుకు ఏపని చేస్తేనేం? ఊరేగింపులలో అట్టలు మోసేవాడు, బీడీ అంటించకపోతే ఎలాతోస్తుంది? మరి—ఆలోచనలు వస్తూవుంటే కల్లుతాగకపోతే ఎలా పోతాయి? జీవితశక్తి అతని పరమలక్ష్యాన్ని ఓడించింది.

పీకింగ్ మహానగరం ప్రాచీన సంస్కృతికి చిహ్నం. ఇక్కడ మానవుల్ని అడివిజంతువులుగా మార్చాలని శతాబ్దుల్నించీ శ్రమ పడుతున్నాడు. కన్నెపిల్లల అమ్మకం 'తెల్లమేడ' (వ్యభిచారగృహం) ల వ్యాపారానికి దోహదం యిస్తోంది. మొగాడు చెమటా, ఆడది వొళ్ళూ అమ్ముకు జీవిస్తున్నారు ఈ పట్టణంలో. సుఖజీవి కథ మెరుపుదీపాన్ని ఒక తెల్లమేడలో కలుసుకోవడంతో, అంతమొందింది.

---

# హ్యా ది కే దే డో

జరిగిన సంగతిది. మే నెలలో ఒక సాయంత్రం వేళ మామూలు టైముకి రెండుగంటలు ముందుగా వచ్చి, జార్జి యాబట్ తన భార్య ఎడ్వినా పడకగదిలో మరొక మొగాడితో ఉందని కనిపెట్టాడు. ఏం చేస్తాడు? ఆ మొగాణ్ణి తన్ని తరిమేస్తాడా? తన్నడమంత సులభం కాదు. అతగాడు తన కంటె బలిష్ఠుడు; మొరటుదేరిన మనిషి. ఘట్టిగా అరిచి పదిమందిని పిలిస్తే కలిసొచ్చేదేముంది—నలుగురిలో నగుబాట్లు కాక.

"హల్లో" అన్నాడు జార్జి.

"హల్లో బ్రదర్" అన్నాడు ఎడ్వినా ప్రియుడు.

"బ్రదర్ లేదు, గిదర్ లేదు—నడు" అన్నాడు జార్జి.

"అంత దూకుడు మంచిది కాదు బ్రదర్" అన్నాడు ఎడ్వినా మనోహరుడు.

మొగాళ్ళిద్దరూ చేతులు కలుపుకోకుండానే పదిలంగా తప్పుకున్నారు. ఆ రాత్రి జార్జి నిద్రమానుకు నక్షత్రాల్ని చూశాడు. ముప్పయ్యారు హేమంతాలూ కళ్ళముందు తిరిగాయి. తమకింక సరిపడదని ఎడ్వినాతో నిష్కర్షగా చెప్పేసి, కడుపునిండా తాగి కళ్లు మూసుకున్నాడు.

తెల్లారి తొమ్మిదికొట్టారు, బాంక్ గుమ్మంలోనుంచుని తన అకౌంట్‌లో ఎంత నిలవవున్నది తెలుసుకున్నాడు.

1913. అందుగ్గా ఆరువందలు తను తీసుకొని మిగ తాది భార్యకి వొదిలేశాడు. ప్రకటనదారుల కంపెనీలో అండర్ వేర్ డిజయిన్లకి వ్యాఖ్యలురాసే జార్జి కప్పులకమ్మీజు వేసుకు టై కట్టుకోవల్సిన బాధ్యతనుంచి విముక్తుడై, ఆరు వందలూ జేబులో పెట్టుకొని ఎటకో ఎచ్చటికో, గమ్యస్థానం గురించి కించిత్ కూడా ఆలోచించవల్సిన పనిలేకుండా విక్టో రియా స్టేషనుకొచ్చి రైలెక్కాడు.

ఇక్కడ మనం ఈ భార్యాభర్తలగురించి రెండుముక్కలు చెప్పుకోవల్సివుంది. జార్జిమాబట్ సామాన్య బ్రిటిష్ పౌరుడు; ఎడ్వినా బ్రిటిష్ పౌరుని సర్వసామాన్య భార్య. ఏడేళ్ళ యుద్ధసేనలోనూ అతన్ని కొన్ని ప్రమాదాలు పల్కరించిన మాట నిజమే కాని అతని జీవితంలో చెప్పుకోదగ్గ ఘనత ఏమీలేదు. ఇక ఎడ్వినా విషయమూ? దేశ సంరక్షణార్థం మరఫిరంగులకి ఆహారమయే సైనికులకి తన స్త్రీత్వాన్ని సమర్పించి, వారిని కార్యోత్సాహుల్ని చేసిన నారీమణి.

యుద్ధవిరమణ ఐనతర్వాత మళ్లా ఇద్దరూ కుదురుకొని కాపరం మొదలెట్టారు. ఆ కాపరం అట్లాకూలింది—జార్జి రెండుగంటలు ముందుగా రావడంవల్ల.

లండన్ వొదిలి డోవర్ వచ్చేసిన రెండో రోజున జార్జికి స్టయిలి కనిపించాడు. స్మగ్లింగ్ ఇతని వ్యాపకం. యుద్ధకా లంలో బాగా ఆర్జించి వున్న స్టయిలి, జార్జి పనికొస్తాడని తక్షణం తన సిబ్బందిలో చేర్చుకోవడంతో, ఇన్నాళ్ళూ

మర్యాదగా బతికినజార్జి అంతర్జాతీయదొంగలగుంపులోఒకడై పోయాడు. స్టయిలికి సర్కస్ కంపెనీ, వస్త్రాములజట్లూ, ఆటలాడే ఎలుగుబంటి మొదలైన కనుమరుగు వ్యాపారాలు చాలా ఉండేవి. జార్జి అన్ని తరగతుల్లోనూ తరిఫీదు అవడమే కాకుండా, సెల్వా అనే అమ్మాయిదగ్గిర క్రమశిక్షణకూడా పొందాడు.

ఇంగ్లండులో జార్జి పీకెలమీదికి తెచ్చుకునేపనులు కొన్ని చేసిన తర్వాత, స్టయిలి అతన్ని స్పెయిన్ పంపాడు. అక్కడున్న స్టయిలి ఏజంట్ పేరు పాబ్లో. లాగకపట్స్ తెలీకపోయినా జీవితపు లోతుపాతులు తెలుసు. ప్రభుత్వానికి సుంకాలు చెల్లించకుండా వైన్ జేబ్ వేసే ముఠాకి పాబ్లో అధిష్టాన గురువు. జార్జీయితేనూ కొద్దిరోజుల్లోనే మిత్రులయ్యారు. అదీ కాక పాబ్లోకి తన చెల్లెలు ఇజబెల్లాని జార్జికిచ్చి పెళ్ళి చేయాలనే అభిప్రాయం కూడా ఏర్పడింది. జార్జిసంసారం త్యజించివచ్చి ఇంకా రెండు నెలలైనా కాలేదు. ఇంతలోనే మళ్ళీ మరో బంధనా?

ఏవో అనుమానాలవల్ల ఫ్రెంచిపోలీసులు జార్జినిపట్టుకొని జైల్లో పెట్టారు. నెపోలియన్ పక్షీయులు ఐస్ క్రీమూ, అరబ్బులు తివాసీలూ అమ్ముకుబతికే పారిస్‌లో పాని అను హైక్లాస్ దొంగఉండేవాడు. అతనూ జార్జి ఒకేజైలుకొట్లో బంధింపబడ్డారు.

జార్జి అడిగాడు: 'సానుభూతి, సంప్రదాయం, కృతజ్ఞత. ధర్మచింతన...వీటికి అర్థంలేదా?'

పాసీ తనఫిలాసఫీ చెప్పాడు : 'హాట్టి ఉద్రేకాలు అవి— సూత్రప్రమాణమైనవి. వాటిగురించి శుష్కవచనాలు పల కనివాడే దయాపరుడు.'

అర్ధరాత్రివేళ మానవుడి ఆలోచనలు పిచ్చివాడి తలపుల్ని పోలి ఉంటాయి. లక్షణమైన ఉద్యోగాన్ని, లోకంతో బాహ్యమైన పెళ్ళాన్ని వొదిలేసి జార్జి సాధించినదేమీ లేదు. రెడ్స్‌నుంచి పారిపోయివచ్చిన రష్యన్ ప్రిన్స్ కాదు తను; అందమైన అమ్మాయి వలపుకోసం బతుకు నాశనం చేసు కున్న సీక్రెట్ ఏజంటు కాదు తను; యిరవయ్యో శతాబ్దం తయారుచేసిన సగటు మనిషి. ఆత్మ ఏదో వుట్టినే గొణు గుతూ ఉంటుంది; దాన్ని వూరుకో పెట్టనూ లేడు—సము దాయించనూ లేడు.

"జీవితంలో నీ ఆశయం ఏమిటి ?" అని అడిగాడు పాసీ.

"ఏమీ లేదు," అన్నాడు జార్జి.

బృహత్సంకల్పాల మనిషి కాదు మన కథానాయకుడు. హిట్లర్ లోక కంటకుడైనా అతనివల్ల జరిగిన ఒక మేలేమి టంటే, ఎసెక్స్‌లోని పల్లె పడుచులు కెనడియనుల కౌగిళ్ళ లోనూ, టులాన్‌లోని ఫ్రెంచివనితలు రుమేనియనుల బాహువుల్లోనూ వాలారు. ఈసాంకర్యంవల్ల పాతవిలువలు భస్మీపటల మయాయి — కొత్తవింకా రూపుదిద్దుకోక పోయినా, అలాటి ప్రమాదకాలం నాటికి ముప్ఫయ్యారు ఈస్టర్ పండగలు గడిపాడు జార్జి.

స్టయిలీ పలుకుబడివల్ల జార్జిని విడుదల చేశారు. పాబ్లో ఉంటున్న గ్రామం జేరుకున్న నాలుగోరోజున ఇజబెల్లా సమస్య తీవ్రరూపం దాల్చింది. మానవాత్మ నగ్నరూపంలో అతిభయంకరంగా కనిపిస్తుంది. జీవితాన్ని సిద్ధాంతాల్లో క్రోడీకరించేవాడికి సుఖంలేదు. స్వభావానికి అనుగుణంగా బతకవల్సినవాడుజార్జి. అర్ధరాత్రి ఆలోచనలు, ఆత్మపరిశోధన, తత్వచింత మొదలైన వాటికి కాడతను. ఏమిటి, ఎక్కడ, ఎప్పుడు, ఎందుకు—అనే ప్రశ్నలు వెయ్యడానికి గాని, తర్కించడానికిగాని అధికారం జార్జికి లేదు.

ఇజబెల్లాగదిలో ప్రవేశించడమూ మానడమూ అని చాలాసేపు మథనపడ్డాడు. ఆమెని స్పృశించకుండా అక్కడి నుంచి తప్పుకోనూవచ్చు; ఆమెని హృదయానికి హత్తుకొని ఆనంద ధామంలోకి దూకనూవచ్చు. స్వభావనైజంవల్ల ఒక్క అంగలో ముందుకి దూకి ఇంద్రియజగత్తుని మరిచి పోయాడు.

ఒకహత్యా, పాబ్లో అకాల మరణం సంభవించాయి తదనంతరం. వాటన్నిటినుంచీ యుక్తిగా తప్పుకుని బయట పడ్డాడు జార్జి ఇజబెల్లాతో. కొన్నిసమయాల్లో వేడి టీ కంటె వెచ్చటి కన్నీళ్ళు మేలుచేస్తాయని ఇజబెల్లా తెలుసుకుంది. సెకనుకి 87 గురు చచ్చిపోతూండగా జార్జి బతికుంటేనేం చస్తేనేం !

కొన్నికథలకి ఆఖరనద నంటూ ఉండదు. అలాంటిదే యిదీను. పాసీ జార్జి ఇజబెల్లా లని పారిస్‌లో కలుసుకున్నారు. జార్జికి తిరిగి నూతన జీవితం ప్రారంభమయింది.

కొన్నికథలు అంతంకావు; మరికొన్ని టుపుక్కున అంతమవుతాయి. కొన్నిటిలో మానవస్వభావం, మరికొన్నిటిలో కథాసంవిధానం, ఇంకొన్నిటిలో వాతావరణం ప్రధానంగా ఉంటాయి. మనందరిలోనూ ఒకకథ ఉంది; ప్రతిఒక్కరిలోనూ ఒక్కొక్కకథఉంది.

ఇది బిరికి అవతల వున్న మనుషుల ప్రవృత్తికి సంబంధించినగాథ. న్యాయమార్గాన నడిచే మనుషులు ఇందులో కనిపించరు. అశాంతి వేర్వేరు వ్యక్తులలో వివిధరూపాల్లో ప్రదర్శిత మవుతుంది. స్టయిలి ధనబలాన్ని నమ్మే కిరాతకుడు; తంత్రగొట్టు పాల్లో; నీతిలేనిది ఎడ్వినా; లోకవంచకుడు పాసీ; మార్జాలంలాటిది ఇజబెల్లా; ఉచ్చుల్లోంచి తప్పించుకునేచేప జార్జి. యుద్ధానంతర యూరప్‌లో కుటుంబాలు ఎలా కూలిపోతున్నదీ, పౌరధర్మం ఏవిధంగా మటుమాయమవుతున్నదీ నిరూపిస్తూ విలయశక్తుల తాండవాన్ని చిత్రించాడు రచయిత. ఆ విలయతాండవంలో మానవాత్మ మూలుగు సన్నగా వినిపిస్తుంది.

---

# పేదల ప్రయాస

సమరేంద్రుడు సామాన్య వకీలు. ఏదో ఆర్జిస్తున్నాడు. లక్షలు నిలవజెయ్యకపోయినా కాలం దొర్లిపోతూవుంది. పెద్దబ్బాయి రాహులని సీమ పంపించాడు. రెండో అబ్బాయి కునాల్ మంచి క్రికెట్ ఆటగాడు. ఇద్దరూ చేతికెదిగినవారు. సమరేంద్రుడుకూడా పెద్దవాడయాడు.

ఇంతలో యుద్ధం విరుచుకు పడింది. రాహుల్ భార్య మంజూ ఒకపక్క పురిటిగదిలో నొప్పులు పడుతూవుంది; మరో పక్కనుంచి రేడియో రెండవ ప్రపంచయుద్ధ మారంభ మైందని చెప్తోంది, 1939 సెప్టెంబరు మూడోతేదీ. రాహుల మనసు మనసులో లేదు. ఇటు లేతతమలపాకులాటి తన భార్య రెండు రోజులు కష్టపడి ప్రసవించిన బిడ్డనిచూసి సంతోషిస్తాడా, అటు పాతికేళ్ళు గడవకుండా మానవజాతి మరొక మారణహోమంలోకి దూకిందని వాపోతాడా? ఇంగ్లండులోని కాలేజీ రోజులు రాహులని కలవరబెట్టాయి. తను మాతృదేశం జేరుకుని ఏడాదన్నా కాలేదు. ఇండియాలో తన స్థానమేదో, కర్తవ్యమేదో తెలుసుకోలేక తపన పడుతూవుండగా యుద్ధశంఖం వినబడింది. కాంగ్రెసేం చేస్తుంది? అదొక్కటే ప్రజలసంస్థ. గాంధీగారేమంటారు? ఈ యుద్ధంలో యిండియా ప్రసక్తి ఎంతవరకూ? నలభై కోట్ల బానిసలమాటేం చెప్తుంది బ్రిటన్!

కాని. సమరేంద్రుడు ఈ బాధలకి అతీతుడు. యుద్ధమున గానే అతని బుర్రలో మెరుపు మెరిసింది. గడిచిన యుద్ధంలో తనతోటి వాళ్ళెందరో లక్షాధికారులయారు. ఈ యుద్ధంలో తనుకూడా అవాలి. చిన్నతనంలో పేదరికంవల్ల తను పడ రాని యిక్కట్లు పడ్డాడు. 'లేమి' అనే పిశాచంవల్ల తన కొడుకులు తరతరాలా బాధపడకుండా చెయ్యాలి. షేర్లు—కాగితం జూటు, యినుము, రబ్బరు. ఓ ఇవ్వాళకొనడం—రేపు అమ్మడం. అవన్నీ లెక్కలు. తరిఫీదూ, బుద్ధీకావాలి. రాజకీయాశయాలు ప్రజానాయకులు సూత్రప్రాయంగా వల్లె వేస్తూంటారు. కాని, నిజయుద్ధరంగం షేర్లమార్కెట్. సమరేంద్రుడు క్లయిస్ స్ట్రీటులో అల్లుకుపోతున్నాడు.

రాహు తమ్ముడు కునాల్‌తో ఒకరోజున అన్నాడు. "ప్రజాస్వామ్యశక్తు లీయుద్ధంలో నెగ్గుతాయి. ఫ్రెంచి విప్లవం నాటినుంచి......"

కునాల్ అన్నని వారించాడు. "యుద్ధం ఒక గేమ్. జీవితం, యుద్ధం—రెండూ ఆటలే. మనం డెమోక్రసీలలో వున్నాం కనక మనది రైటని భావిస్తున్నాం. అదేమాదిరిగా జర్మన్ యువకుడూ అనుకుంటాడు. మన మింకా మన నాయకుల్ని ప్రశ్నిస్తున్నాం; వారారాధిస్తున్నారు".

తర్కంలో పొరబాటులేదు. కాని, రాహు వేదనతో కుమిలిపోతున్నాడు. ఎందుకీ ఆరాటం? తనకే తెలీదు. బ్రిటిష్‌పంచని గడిపివచ్చిన తనకి ఇండియా సరిపడలేదా?

తండ్రి లక్షలార్జించే ప్రయత్నంలోవుండి తన సోషలిస్టు పలుకులు విని నవ్వుతాడు. తమ్ముడు యుద్ధం వొట్టి క్రికెట్ మాచ్ అంటూ ఆఫీసరుగా చేరిపోయాడు. రాహుకి ముందడుగు పడలేదు. గత్యంతర మేమిటి ? వసంతగీతికలాంటి మంజూ పక్కకి పిలిచింది. కాని, ఆ రాగాలాపనలో కూడా అతనిగుండె కుదుటబడలేదు.

రాహు పల్లెప్రాంతాలకి వెళ్ళాడు;—సమరేంద్రుడి తండ్రి దేవతవున్నవూరు. కర్తవ్యమేమిటో తనకి స్ఫురించక తాత గారి నడుగుదామని వెళ్ళాడు. దేవత డెబ్బయేళ్ళవాడు; నిమ్మపండులాంటి వొళ్ళూ, వెండి తీగెల్లాంటి జుట్టూ, ఆయన గాంధీ బంటు. పల్లెనీ పల్లెప్రజనీ అమితంగా ప్రేమిస్తాడు. దయాస్వరూపుడు దేవత. గ్రామీణు లందరూ అతనికి చేయెత్తి నమస్కరిస్తారు. రాహు దేవతని చూసిన ఉత్తర క్షణంనుంచీ తన తండ్రినీ, ఆ తండ్రి తండ్రినీ పోల్చుకోవడం మొదలెట్టాడు. ఒకరు ధనం రెండుచేతులా సంపాయిస్తున్నారు; మరొకరు ప్రేమని రెండు చేతులా పంచిపెడుతున్నారు. ఎవరు పూజనీయులో చెప్పక్కర్లేదు.

"తాతయ్యా, యిది ప్రస్తుతం సామ్రాజ్య యుద్ధమే—కాని, కొద్దిరోజుల్లో ప్రజాస్వామ్య యుద్ధంగా పరిణమిస్తుంది."

"అవచ్చు—కాని, మన సంగతి ఫైసలు చెయ్యమంటున్నాడు గాంధీజీ."

కజోలీ అనే పదిహేనేళ్ళ రైతు పడుచుని చూశాడు రాహు. ఆపిల్ల నమ్రతకి ఆదరణకీ ఎంతో ముచ్చట పడ్డాడు. కజోలీని ఒక సామాన్య రైతు కుటుంబం. వారి కున్నదల్లా ఒక మట్టిగుడిసా, మంగళమనే ఆవూ, గింజలు పండించు కునేందుకు కాస్త నేలాను. ఆమెకి ఒక తమ్ముడున్నాడు. కజోలీ తలిదండ్రులకి దేవతఅంటే ఎంతో అభిమానం. రాహు కలకత్తా తిరిగివచ్చాడేగాని, పల్లెపరిసరాల్లోని కజోలీ కుటుంబమే నిజభారత చిత్రంలా అతని హృదయం మీద హత్తుకుంది.

ఏడాది—రెండూ గడిచాయి. తన తండ్రిని గవర్నరు గారి గార్డెన్ పార్టీకి ఆహ్వానించారు. సమరేంద్రు డొక్క ముక్క అనగానే, రాహుకి పెద్ద వుద్యోగం వచ్చింది. కాని, అతనికి శాంతి చిక్కలేదు. దేశంలోనే కరువైన శాంతి అతని కెక్కడ లభ్యం కాగలదూ ?

Do or Die అన్నాడు గాంధీజీ. ప్రభుత్వం నాయకుల్ని చెరసాలల్లో పెట్టింది. దేవతనీ, కజోలీ తండ్రినీకూడా పట్టుకు పోయారు. దారిచూపే నాథుడులేక ప్రజలు రగిలే విద్వేషాగ్నితో తిరగబడ్డారు. ప్రభుత్వం ప్రజల్ని నల్లుల్లా నలిపేసింది.

కజోలీ—తల్లినీ తమ్ముణ్ణీ—సాయంగా పెట్టుకుని సంసారం యీడుకు వస్తోంది. బెంగాల్లో క్షామదేవత తల ఎత్తింది. జపానువాడి చేతికందుతాయనే సాకుచెప్పి, నావల్నీ, పడ

వల్ల గవర్నమెంటు ఏజంట్లు పల్లె ప్రజని బెదిరించి కొనేశారు; ధరలు పెంచి ధాన్యంచేర వేశారు. నిక్షేపంగావున్న గ్రామజీవనాన్ని పనిగట్టుకు ధ్వంసం చేసింది ప్రభుత్వం.

తన తండ్రితోబాటు జైలులోవున్న ఒక మిల్లు పనివాణ్ణి వివాహమాడింది కజోలీ. ఇద్దరూ ఈడూజోడూ. ఆమె వ్యవసాయం నేర్చిన యువతి; ఇతను పట్టణకార్మికుడు. అయిదారు నెలలన్నా సుఖంగా వున్నారో లేదో దరిద్ర దేవత విలయతాండవ మారంభించింది. కజోలీ భర్త పట్టణంలో పని సంపాయిద్దామనే అభిలాషతో రైలు బాటమ్మట పోతూ వుండగా, గుండుదెబ్బకి మరణించాడు. గవర్నరు వెళ్తున్నాడని లైనంతా బందోబస్తుచేశారు. సిపాయి ఛాలెంజిచేస్తే, బెదిరి పారిపోవడంవల్ల కజోలీ భర్త రైలుకట్టమీద 'హరీ' అనవలసివచ్చింది. తనభర్త దుర్మరణం ఈనాటికూడా కజోలీకి తెలీక,అతనిరాక ఎదురుచూస్తూ వుంటుంది.

తిండిలేక చిక్కి శల్యమై ఆవు మరణించింది. 'అన్నమో రామచంద్రా' అని అల్లాడుతున్న ప్రజలు కలకత్తా దారి బట్టారు. కజోలీ కూడా తల్లీ తమ్ముడుతో అదేబాట ననుసరించింది. గ్రామం వొదలక పూర్వమే కజోలీకోసం డాఫర్ల ఏజంటు వచ్చాడు కాని కజోలీ తల్లి వాణ్ణి తరిమి తరిమి వెళ్ళగొట్టింది. చెట్లు తోపులలో నిద్రపోతూ ప్రయాణం సాగించారు; చెట్లవేళ్ళె వారి ఆహారం. కజోలీ అయిదు నెలల గర్భిణి. అలాగే నడిచారు. ఎన్ని రోజులో

మెయిన్‌రోడ్డు జేరుకునేటప్పటికి తమలాంటి పుడకలు ఎన్నో కనిపించాయి.

కలకత్తా—దేవేంద్రుడి పట్టణంలా వారి ప్రాణాలకి. రోడ్డుమీద పడివున్న శవాలకోసం నక్కలూ పోరాడుతున్నాయి.

సంధ్యాసమయం. చెట్టు తోట్రలో తమ్ముణ్ణి తల్లినీవుండమని ఆశగా అలమూ దొరుకుతుందేమోనని నాలుగడుగులు వేసింది కజోలీ, కాళ్ళలో శక్తిలేక రోడ్డు పక్కగా పడిపోయింది. వేగంగా పోతున్న మిలిటరీ లారీ ఆగింది. లోపలవున్న సిక్కు బ్రెడ్ చూపించాడు. కజోలీ జేవురించిన మొహంతో చెయ్యిజాచింది. సిక్కు దిగివచ్చి ఆమె చేతిలో పెట్టాడు బ్రెడ్. రొట్టెచూడగానే తమ్ముడూ తల్లీ జ్ఞాపకం వచ్చారు. వాళ్ళకి లేకుండా తను తింటుందా ? బ్రెడ్ చేతిలో పుచ్చుకొని పరుగెత్త బోయింది. కాని, కాళ్ళలో సత్తువేదీ! కింద పడిపోయింది.

సిక్కు చూస్తున్నాడు. సంవత్సరమయింది పెళ్ళాన్ని వొదిలివచ్చి. నరాలు పీకుతున్నాయ్. పొంకంగావున్న ఆడశరీరం. వొదులు కుంటాడా ఈ ఛాన్సు ? రోడ్డుపక్క ధూళిలో, అసురసంధ్యవేళ ఆ సిక్కు తనని అనుభవించ పోతూవుండగా, కజోలీకి కనురెప్పలు విడివడ్డాయి గాని పెనగులాడే శక్తిని కోల్పోయిన ఆమెదేహం నిద్రించింది. కజోలీకి గర్భస్రావ మయింది. మూడురోజుల తర్వాత

కలకత్తా హాస్పిటల్లోగాని ఆమె కళ్ళు తెరువులకి రాలేదు. సిక్కు కామాంధుడయినా పశువుకాడు కనక కజోలీ బతికి మళ్ళీ బట్టకట్టింది. ఆ సిక్కు ధర్మమా అని కజోలీ తల్లీ తమ్ముడూ లారీమీద కలకత్తా చేరుకున్నారు.

కలకత్తాలో మాత్రం ఏముంది ! వేళకివెళ్తే యింతగంజి పోస్తారు ! అక్కడమాత్రం ఎన్ని కొట్లాటలు ! మనుషుల్ని జంతువులకంటె నీచంగా మార్చింది—బ్రిటిష్ సామ్రాజ్యం లోని రెండవ పట్టణం. ప్రజలు సందుగొందుల్లో ఎలకలకంటె హీనంగా మరణించారు. కజోలీ తల్లి ఆలాటిచావే చచ్చింది.

కజోలీకి తరుణోపాయం కనిపించలేదు. సందు చివర నుంచుని ఆడశరీరాలబేరగాడు నిత్యమూ పల్కరించేవాడు. ఈ మహాపట్టణంలో రాహు కనిపిస్తాడా ! భాగ్యవంతులకి పేదల ప్రయాస అర్థమవుతుందా ! కజోలీకి రాహు గురించి ఎట్టి భ్రమలూ లేవు.

పరీక్షింపవచ్చిన బెంగాల్ కరువుని కజోలీ జయించిందా! వీధుల్లో వారాపత్రికలమ్ముతూ పొట్టపోసుకునేది; ఆమె తమ్ముడు రయిల్ స్టేషన్లో జోళ్ళకు రంగు పులిమి దినానికి పావలా అర్ధా సంపాయించేవాడు. ఇదీవాళ్ళ జీవితం.

అంతటి మహాపట్టణంలో కజోలీ రాహు కలుసుకుంటారా! ఊహు.

---

# నాడు - నేడు

ఏ దేశమయితే వర్తకవ్యాపారాలూ ధనసంపాదనా ప్రధాన సూత్రాలుగా పరిగణిస్తుందో, ఆ దేశపు రాజకీయ రుజువర్తనాన్ని పక్క దేశాలు కాస్త అనుమానాస్పదంగా చూడటం సహజం. నేటియూరప్‌లా పదహారవ శతాబ్దపు ఇటాలియన్ సామ్రాజ్యం ముక్కముక్కల చీలికలై సామంతప్రభువుల పాలనకింద, చక్రవర్తీపోప్‌ల ఆజ్ఞలకు లోనై వుండేది. సామంతప్రభువు (డ్యూక్) తన రాష్ట్ర ప్రజల ప్రాణమానాలకి సర్వాధికారి. ఇమోలా రాష్ట్రానికి పాలకుడైన బోర్గియా యిటలీ అంతకీ సింహస్వప్నం. ఇమోలా పక్కనే వుంది ఫ్లారెన్సు, అది స్వయంపోషక రాష్ట్రం—రిపబ్లిక్. ఫ్లారెన్సు వాణిజ్యంలో గడసరి–ధనంతో తులతూగుతూ వుండేది. బోర్గియాకి ఫ్లారెన్సు పట్ల కన్నెర్రగా వుండటంలో విశేషంలేదు. సరిహద్దు తగాయిదాలు పరిష్కరించేందుకూ, నిరాక్రమణ సంధి జరుపుకునేందుకూ సమస్తాధికారాలూ వున్న రాయబారిని దౌత్యానికి పంపవలసిందని ఇమోలా ప్రభువు కోరాడు. ఫ్లారెన్సు మెకవెల్లీని పంపింది.

మనుషులందరూ ఒకటేననీ, ఒకే మాదిరి వుద్రేకాలు కలిగి వుంటారనీ, పరిస్థితులు సమమైనపుడు కార్యకారణ సూత్రంలో భిన్నత వుండదనీ మెకవెల్లీ విశ్వాసం. ఫ్లారె

న్నలో అతనికంత మంచిపేరు లేదు. సన్నగిలిన నీతినియమాలు కలవాడనీ, వుపయోగంలేని మసిమిసి పాత చెప్పులా గిరవాటు వేస్తాడనీ ప్రతీతి. అయినప్పటికీ, సైనరీ (పార్లమెంటు లాటిది) లోని ప్రతికక్షులుకూడా అతని ప్రజ్ఞా విశేషానికీ నేర్పరితనానికీ చకితులయ్యేవాడు. ఫ్రెంచి చక్రవర్తి అంతవాణ్ణి బుట్టలో వేసేశాడు మెకవెల్లీ ఒకప్పుడు.

మెకవెల్లీ ఈసారి తనతో బాటు, పియరో అనే యువకుణ్ణి వెంటబెట్టుకుని ఇమోలాకి బయల్దేరాడు. పియరోకి యింకా యిరవై ఏళ్ళు నిండలేదు. మెకవెల్లీ దగ్గిర తర్ఫీదు పొందేందుకు వాళ్ళమామ పంపించాడు. ఇద్దరూ గుర్రాలమీద స్వారీ చేస్తున్నారు.

"నువ్వు గ్రీకు రచయితలని గ్రీకుభాషలో చదవగలిగావు, నాకా భాగ్యం లేకపోయింది. అదృష్టవంతుడివి" అన్నాడు మెకవెల్లీ పియరోతో.

"చదివినంత మాత్రాన ఏం వొరుగుతుంది?"

"మానవకోటి వాంఛించే సుఖం మంచితనంలో వుందని చెప్పుంది గ్రీకుసాహిత్యం. దాన్ని పొందేందుకు మంచి కుటుంబంలో పుట్టడం; సత్పురుషులైన స్నేహితులు; అదృష్టదేవత కనికారం; ఆరోగ్యం, ధనం, అందం, దారుఢ్యం, కీర్తి, గౌరవం, సత్ప్రవర్తన................"

యువకుడు ఫకాలున నవ్వుతూ అన్నాడు "అంతేకాదు, గ్రీకు రచయితలు చెప్పేది. జీవితం అస్థిరమైనదనీ,

కష్టపరంపరంలతో నింపివున్నదని అంటారు. అందుచేత, ఎంత సుఖాన్ని కోసుకు నేందుకు వీలుందో అంతా, కాలాతీతం కాకపూర్వమే, అనుభవించ మంటున్నారు.”

మెకవెల్లి ఇమోలా జేరిన తర్వాత బోర్గియాని సందర్శించాడు. రాజకీయవ్యవహారాలు తర్కించాడు. నిర్ణయవిషయాలు మాటకి వచ్చినపుడు తన గవర్నమెంటుని సంప్రదిస్తానని తప్పించుకుంటూ వుండేవాడు. “వ్యక్తిస్వాతంత్ర్యానికి యిబ్బంది కలగనంతవరకూ రాజకీయస్వాతంత్ర్యం ఎంత తగ్గినా, ప్రజలు ఆందోళన చెయ్యరు. యిల్లూవాకిలీ, పెళ్ళాంబిడ్డలూభద్రంగావున్నంతవరకూప్రజానీకంతెమకున్నదానితో తృప్తిపడుతూ సరిపెట్టుకుంటారు.’ అన్నాడు బోర్గియా. మెకవెల్లి మొహంలో ఏనాడూ తామసం కనిపించదు. మందహాసంతో సలహాని మింగేశాడు.

“గోడ మీాది పిల్లివాటం మీా ఫ్లోరెన్సుది,” అని సూటీపోటీగా అన్నాడు ప్రభువు. మెకవెల్లీ పెదవి కదిపితేనా!

ఇమోలానగరంలో బార్తలోమీా అనే ధనికుడు వున్నాడు. అతని మూడో పెళ్ళాం అరీలియా. మొదటి యిద్దరి పెళ్ళాలూ నిస్సంతుగా మరణించారు. అరీలియా అయినా ఒక పిల్లవాణ్ణి కనాలని బార్తలోమీా చిరతర వాంఛ. మెకవెల్లీ అరీలియాని చూసీచూడగానే ప్రేమలో పడ్డాడు. ఆమెని తనదిగా చేసుకోవాలని రాత్రింబవళ్ళూ ప్లానులు వెయ్యడం మొదలెట్టాడు.

బార్తలోమియో ఏ నాడూ నగరపొలిమేర విడిచి వెళ్ళడు. అతన్ని ఏదో మిష మీద మరో గ్రామం పంపాలి. పదహారవ శతాబ్దంలో ప్రయాణం 'కాశికి వెళ్ళినా కాటికి వెళ్ళినా ఒకటే!' లాంటిది. మెకవెల్లి మతగురువుకి పాతిక కాసులు లంచం యిచ్చి, బార్తలోమియో తీర్థయాత్రకి వెళ్ళేటట్లు చేశాడు. యాత్రామహాత్మ్యమేమిటంటే, అక్కడ వుండే ఒకానొక చెట్టు వేళ్ళు భర్త నమిలితే, భార్య సంతానవతి అవుతుంది. బార్తలోమియోకి పుత్రసంతానం కాక కావలసినదింకేముంది ?

రాత్రి ఎనిమిదిగంటలకి అరీలియాని మెకవెల్లి కలుసుకునేందుకు సన్నాహమంతా జరిగింది. పియరోని దొడ్డిగుమ్మం దగ్గిర కాపలా వుంచాడు. తను ముస్తాబై వీధిలోకి వచ్చే వేళకి డ్యూక్ దగ్గిర్నుంచి వార్తాహరుడొకడు వచ్చి, మెకవెల్లితో తొందరగా సంప్రదించవలసిన విషయాలు కొన్ని వున్నాయని ప్రభువు మాటగా నివేదించాడు. 'సిద్ధాన్నం' యిలా అయిపోయిందే! ఒక్క నిముషంలో తను అరీలియా యింట్లోకి దూరిపోయి వుండునే! డ్యూక్ ఆదేశాన్ని ఆజ్ఞగా పాలించాలి! అరీలియా కోసం...మానడు. మెకవెల్లి భటుల వెంట ప్రభుభవనానికి వెళ్ళాడు.

అక్కడ భరించలేనంత ఆలస్యం అయింది. నదురూ బెదురూ లేకుండా రాయబారం సాగించాడు. వీధిలోకి వచ్చేటప్పటికి రాత్రి రెండయింది. విపరీతమైన చలి. సన్నటి

తు: పర నిరుత్సాహానికి చీకాకుని జోడిస్తోంది. దొడ్డిగుమ్మం దగ్గిర కాపలా వుంచిన పియట్రో లేడు. మరిగిన పాలు నేలపాలయ్యాయి. దిమ్మెక్కిన తలబాధతో తెలతెలవారే వేళ కళ్ళు మూసుకున్నాడు మెకవెల్లి. అందాలరాసి అరీలియాని తను పొందలేకపోయాడు.

మర్నాడు బార్తొలోమియో వూరునుంచి వచ్చాడు. మెకవెల్లి మతిగురువుని మరొక అవకాశం కల్పించుకుని ప్రాధేయపూర్వకంగా పాకులాడాడు కాని లాభం లేకపోయింది. ఈలోగా సరిహద్దు పేచీల తీవ్రత ఒకానొక రాజకీయ హత్యతో హెచ్చింది.

"నువ్వు తెలివిగలవాడివి; సమర్థుడివి; ప్రజ్ఞాధురీణుడివి. నా ఆస్థానంలో వుండిపో. నీకు కావలసినన్ని సిరిసంపదలు యిస్తాను" అన్నాడు సామంతప్రభువు మెకవెల్లితో.

"నేను దేశద్రోహిని కాదు, స్వామీ."

"మైకేల్ ఆంజిలో, లియోనార్డోలకీ అతీతుడివా? వారు నా భృతిని సంతోషంతో అంగీకరించారే!"

"వారు ఆర్టిస్టులు—కళాకోవిదులు. నేను రాజకీయవాదిని. సమస్తమూ నా దేశానికే అర్పణ చేస్తాను."

"మెకవెల్లీ, ఫ్లోరెన్సుని నమ్ముకోకు. నేను నిన్ను ఇమోలాకి గవర్నరుగా చేస్తాను."

మెకవెల్లి మనసులో అరీలియా తృటికాలం మెరిసింది. తనది భగ్నహృదయం. అరీలియాని పొందలేకపోయాడు.

తనే ఇమోలాం గవర్నరయితే అరీలియా అరచేతిలో వుంటుంది. కాని, జన్మభూమి ఆత్మకంటె ప్రియపాత్రమైనది.

"బార్తలోమీని పారిస్ పంపుదా మనుకుంటున్నాను," అన్నాడు డ్యూక్. ఆ వాక్యంలోని అవకాశమూ ఆహ్వానమూ మెకవెల్లికి స్ఫురించక పోలేదు. ఆఖరి ఎరగా అరీలియాని విసిరాడు ప్రభువు. అయితే డ్యూక్‌కి తన ప్రణాయకాండ అంతా తెలుసు నన్నమాట. నుసకరేయి విడిపోయింది. పరాయి మొగాల మధ్య ఏకాకిగా నుంచున్న మెకవెల్లి, 'బార్తలోమీని ఇమోలానుంచి పంపడమంత భావ్యంకాదు. ఇమోలా ప్రజకి అతనిమీద అఖండ గౌరవం. ఇక్కడే వుండి బార్తలోమీ మీకు ఎక్కువగా సాయపడగలడు,' అన్నాడు.

బోర్గియాకి మెకవెల్లి ధోరణి అర్థమయింది. 'సరే— అలాగే కానిద్దాం,' అన్నాడు.

మెకవెల్లి యింక ఇమోలానుంచి వెళ్ళిపోతున్నాడు. పెళ్ళాం అతనికి పదేపదే జ్ఞాపకం వస్తోంది. ఇమోలా అనుభవంతో మనిషి పెరిగాడు—ఎదిగాడు—విశాలమయినాడు. పియరో యజమాని దగ్గిరికి వచ్చి, తను ఫ్లోరెన్సు రాననీ, సైనికుడిగా చేరుతున్నాననీ మెకవెల్లికి తెలియజేశాడు.

"వద్దు. ఆ పొరబాటు చెయ్యకు. శ్రమ సైనికుడిది, కీర్తి నాయకుడిది. సైనికవృత్తితో నీ ఆత్మని అమ్మేసుకోవలసి వస్తుంది."

పియరో పిన లేసు. అతను తొడుక్కున్న వ్రాలుచొక్కా వల్ల పరలోక పరమ హాస్యం మెకవెల్లీకి బట్టబయలయింది. ఆ చొక్కా అరీలియా కుడుతూవుండటం తను చూశాడు. దాన్ని ఈ నాడు పియరో ధరించాడు. ప్రస్తుతం అరీలియా గర్భవతి. ఇది తనకి సంబంధించిన ఆవేదన కనకగాని లేక పోతే మెకవెల్లీ పొట్టచెక్కలయేట్లు నవ్వి వుండును. అరీలియా పియరోని దగ్గిరికి తీసుకుందా,—మెకవెల్లీ లాటి మేధావిని వదిలేసి! చిత్రం—విచిత్రం—మహాచిత్రం.

"అప్రయోజకులముందు తెలివిగానూ, ప్రయోజకుల ముందు తెలివితక్కువగానూ మాట్లాడకు. మనిషి 'మూడ్' తెలుసుకుని, దానికి అన్వయించేట్లుగా కబుర్లాడు నీ ప్రవర్తనలో నాజూకు చిలకరించు మనుషులకి సుగుణాలఎక్కువ చెప్పక, వారి లోపాలలో వుండే ఔన్నత్యాన్ని పైకి లాగి శ్లాఘించు. శత్రువై అపకారం చెయ్యవచ్చునని గుర్తు వుంచుకుని స్నేహం చెయ్యి. పరిసరాలకి అనుగుణంగా మాటలు వాడు. నిజం మహాప్రమాదమైన ఆయుధం, దాన్ని ఎంతో నిపుణతతో వుపయోగించాలి. నేను చెప్పినమాటలు నేను నమ్మను; నేను నమ్మిన మాటలు నేను చెప్పను. ఎన్నో అసత్యాల మధ్య దాగ్గే నా నిజం సామాన్య నేత్రాలకి కనిపించదు," అంటూ వుపదేశించాడు మెకవెల్లీ. 'తెలిసినదంతా యితరులకి చెప్పడంలో తెలివిలేదు."

"సమాధిరహస్యం నేను," అన్నాడు పియరో, మెకవెల్లీ భావన అర్థం చేసుకుని.

గుర్రం ఎక్కాడు మెకవెల్లీ. 'ప్రేమ—డామిట్. ప్రేమే పాటిది కళముందు.' తనభటులతో ఫ్లారెన్సు వైపుగావస్తూ తలపోస్తున్నా డతను: ప్రేమ తాత్కాలికం. కళ అనంతం. ఒక నాటకం రాయాలి, అరీలియా అందులో నాయిక. భగ్న ప్రేమ కనక నే కళాఖండం వెలువడుతుంది. డాంటీ పెట్రార్కా, హొరేస్—వారు ఎలా బతకగలిగారు? వారి జీవనస్పర్థా అశాంతీ కళలో తెలదాచుకున్నాయి. తను ఒక రాగిముక్క పోగొట్టుకుని, కిరీటంలో పొదిగే వజ్రాన్ని సంపాయించాడు. చూపట్టే ప్రపంచంలో నిజలోకాలు మిథ్యగా తోస్తాయి. కళాసృష్టి అనే ఆనందాతిశయంలో వోలలాడుతూ ప్రసూన పరిమళ భరితమైన ఫ్లారెన్సు చేరుకున్నాడు మెకవెల్లీ.

రేపో నేడో యుద్ధం విరుచుకుపడుతుంది ఫ్లారెన్సు సుభిక్షంగా వుండటానికి ఫ్రెంచిచక్రవర్తి ప్రాపకం కారణం. 'కళ, కళా? స్వాతంత్ర్యం లేనిదే కళేమిటి? స్వాతంత్రం పోగొట్టుకున్న మనుషులు సమస్తమూ పోగొట్టుకుంటారు.''

* * * *

నాలుగేళ్ళు గడిచిపోయాయి. ఇటలీ ఎంతో మారి మెకవెల్లీకి పెద్దతనం వస్తోంది—తాగుబోతుకొంపకిపోతూ వడ్రంగితోనూ కుమ్మరితోనూ మెకవల్లీ చీట్లాడటం మర్యాదస్తులకి నచ్చలేదు. రాజ్యాలేలే మంత్రులకంటె సామాన్య జీవులలో ఎక్కువ నిజాయితీ వుందనేవాడు మెకవెల్లీ.

"ఆకలి తీరడంలోనే ఆత్మతృప్తి," అంది మెకనెల్లీ పెళ్లాం, ముగ్గురు పిల్లల తండ్రిని వుద్దేశించి. చక్కగా రోస్టు చేసిన ఆరు సంగీతప్పిట్టలు మెకవెల్లీ ముందు ప్లేటులో వున్నాయి.

"హృదయంలో పాటతో ఆకాశపథాల యాత్ర సాగించే ఈ పిట్టల్ని వండుకు తినేందుకు ఏ సోమరి కుర్రాడో నేల కూలుస్తాడు. అలాగే మానవుడు ఊహాంచలాల ఎగిరే ఆశయాలతో, అనంత సౌందర్యాన్ని వెతికే మనోనేత్రంతో, ఆనఘులు అందుకునే వుబలాటంతో—కడపటిని విధివలలో యిరుక్కుని, కీటకాలని మేపడం మినహా మరో పరమార్థాన్ని సాధించలేకపోతున్నాడు."

"తొందరగా తినకపోతే చల్లారిపోతుంది. ఆపైని మాట్లాడవచ్చు," అంది పెళ్ళాం.

మనిషి దేశకాలపరిస్థితుల బానిస-నాటకం సృజించిన మెకవెల్లీ ఎలుగెత్తి అరిచిన బానిస, అంతే!

---

# రావు - తిరిగి రావు

అందరిలోకీ ఆఖరివాణ్ణి నేను. అన్నయ్యలూ, అక్క-య్యలూ, అమ్మా, నాన్నా అందరూ భోజనాల బల్ల ముందు నుంచున్నారు. నాన్న 'భగవంతుడా నీకు మా ధన్యవాదములు' అంటున్నాడు. అందరూ కళ్ళుమూసుకు ప్రార్థనలో నిమగ్నులై వున్నారుగాని నేను మాత్రం-ఎలకపిల్లలా మా అమ్మ పక్కని నక్కి-వున్న నేను మాత్రం-ప్రార్థనా వాక్యాలు పలుకుతున్న నాన్న మొహంలోకి తేరిపార చూస్తున్నాను. నాన్న కాస్త గుడ్లు వురమగానే నేనూ తలవంచుకు కళ్ళు మూశాను. కళ్ళు ముయ్యడమేగా ప్రార్థన అంటే!

నలభై ఏళ్ళ క్రితం సంగతి, జ్ఞాపకాల సంచీ బహు విచిత్రమైనది. ఘటనా సంపుటిలో కొన్ని ఎందుకో చిరతరముద్ర పొందుతాయి; మరి కొన్ని నెమరువేస్తేనే స్ఫురణకి వస్తాయి; మిగతా సమస్తం కాలగర్భానికి అంకితం. ఆనాడు నాన్న 'గుడ్లు వురిమి చూడటం' అరశతాబ్దం తర్వాత కూడా నాకెందు కింత స్పష్టంగా కళ్ళకి కట్టినట్లు వుంది? ఆ చూపులోనే నాన్న వార్నింగ్ వుంది-నేను ఎందుకూ కొరగానివాడి నవుతానని.

ఆ చిన్నతనపు రోజుల్లో బతుకే హాయి. పాడి పంటలతో, ధనధాన్య సమృద్ధితో మాలోయ ఒక భూలోక

స్వర్గం. బ్యాంకుగదుల్లో పనిచేస్తున్న నాన్నా, అన్నయ్యా ప్రతి శనివారం మధ్యాహ్నం జీతాలు పట్టుకొచ్చేవారు. డబ్బు అంతా అమ్మచేతిలో పోసేవారు. అబ్బ! ఈ నాటికి మళ్లీ కాగితాలా? నాణెములు గలగల్లాడేవి. ఆ గలగల శబ్దంలో శ్రావ్యతవుండేది. భోజనాలగదిలో మూలవున్న చిన్న భోషాణంలో మా సంపద అంతా అమ్మ తన చేతులతో తను దాచేది. అందులో ఎంత విలువవున్నదీ ఎవరికీ తెలీదు–ఆఖరికి నాన్నకికూడా. సంపాయించడమే మొగాళ్ళ వంతు; గృహకృత్యమంతా అమ్మ చేతుల మీదుగా నడిచేది.

ఎంత బావుండేవారోజులు. రావు—తిరిగిరావడం కల్ల. నాన్నమాటంటే అందరికీ హడల్. ఏనాడూ ఆయన మమ్మల్ని తిట్టినట్టుగానీ, కొట్టినట్టుగానీ, ఆఖరికి కఠినంగా మాటలన్నట్టుగాని నాకు జ్ఞాపకం లేదు. కాని, 'ఇంటిపెద్ద' అంటే సింహస్వప్నం.

కావడి కుండల కాలం ఒకేలా ఎప్పుడూ ఎందుకుంటుంది? పెద్దన్న పెళ్ళిచేసుకొని బ్రౌన్ వొదినతో వేరే కాపరం పెట్టాడు. బ్రౌన్ ఎంత మంచిది! ఎప్పుడూ లవండరు వాసనతో చిలిపి కళ్ళతో నాబుగ్గలు గిల్లేది. చెప్పొద్దూ—బ్రౌన్‌ని చూసీ చూడగానే నేను ప్రేమించేశాను. నవ్వుతున్నారా? ఇది నిన్నా మొన్నా జరిగిన సంగతి కాదు—

నలభై ఏళ్ళ క్రితం మాట. బ్రౌన్ యిప్పటికీ ముగ్గు బుట్ట లాటి తలతో అదేవో ప్రాణ్ళో వుంది. అమ్మ నాకు భౌతికా కారం కల్పించగా, బ్రౌన్ నాకు మనశ్శక్తి ప్రసాదించింది.

అన్నా వొదినా మాకో ఫర్లాంగు దూరంలో కుటీరం నిర్మించుకుని వుంటూ వుండేవారు. వారిది కుటీరం అన్నంత మాత్రాన మాది భవంతి అనుకోకండి. మాదీ గృహాస్త్ర మార్గంలోవున్న యిల్లు. చిలకా గోరింకల్లా యిద్దరేకనక వారికి కుటీరంచాలు. ఇంట్లో కార్యకరాదులకి వారువచ్చి ఆదుకుంటూ వుండేవారు. పండగ పబ్బాలలో అందరం కలిసీ మెలిసీ వుండేవాళ్ళం. బ్రౌన్ ఎంత కలుపుగోలు మనిషి! ఇంటిల్లపాదికీ ఆమె అంటే గురి. అన్నకి కొడుకుపుట్టిననాడు— వాడిపేరు గారెట్—లోయలో అందర్నీ విందుకు పిలిచాం. ఆ రోజుల్లో మాలోయమనుషులు వంటకాల రుచిపాకం గురించి మినహా మరోటి మాట్లాడేవారేకాదు. ఈనాడు ఏమూల విందామన్నా ప్రపంచ సంక్షోభమూ, కరువూనూ.

చక్కటి పసరికతో మాలోయ ఎంత రమ్యంగా ఉండేదీ! సౌమ్యతకీ సౌజన్యానికీ పచ్చటి లోయజీవితం ఒక నమూనా. కుటుంబంలో మొదటి తుపానుకి మా డేవీఅన్నయ్య కారకుడు. అతను 'కార్మిక సంఘానికి కార్యదర్శి' నాన్నతో అప్పుడప్పుడు 'shiding scale wages,' 'కనీసపు హక్కులు' బొగ్గుబళ్ళు లాగేందుకు 'గుర్రాలకి బదులుగా వచ్చిన

కూలీలు'—మొదలైన విషయాలు ప్రసంగిస్తూ వుండేవాడు. నాన్నకి వర్గచైతన్యం గురించీ, ప్రపంచ కార్మికుల గురించీ నీసమంతకూడా తెలిసినట్టు తోచదు. ఆయనకు తనవయస్సు పనివాళ్ళలో మంచి పలుకుబడి వుండేది. అన్నయ్య నాన్నని ఎలాగో అలా బుట్టలోవేసి, 'పెద్దసమ్మె' చేయించాలని ప్రయత్నిస్తూ వుండేవాడు. ఒకనాడు భోజనాలదగ్గిర ఈ వివాదం వచ్చేటప్పటికి నాన్న మండిపోయాడు.

''ఇది యిల్లు—సారాయుంగడీ కాదు. ఈ యింటికి నేను యజమానిని. ఇష్టంలేనివారు ఎవరిదారివారు చూసుకో వచ్చు''అని అనేసి తాపీగా భోజనంలో పడ్డాడు. అమ్మని 'ఏయ్ పిల్లా' అని వేళాకోళంచేస్తూ. ఆరాత్రి యిద్దరు అన్నయ్యలూ మానించి విడిపోయారు. ఇన్నేళ్ళు గడిచిన తర్వాత కూడా నాన్నది పొరబాటు అనలేను. కుటుంబ వ్యవస్థ చితికిపోతోంది—కాని ఆయన కుటుంబీకుడు. తప్పుదారి పట్టిన కుర్రకుంకలకోసం కుటుంబాన్ని వొడ్డుతాడా? వెర్రి మర్యాదకోసం కాదు ఆయన పాకులాడింది—బతుకు తెరువు గురించి.

''నువ్వు సమ్మెచేసి సాధించే దేమిటి? మార్కెట్లో బొగ్గుధర పడిపోయింది. అంచేత అధికారి మన జీతం తగ్గించాడు. భగవంతుడి మీద భారంవేసి మనం బతిమాలో బామాలో తంటాలు పడాలి. బొగ్గుగనులు దేశీయం చేయ

వలసిందే—కాని, నువ్వూ నేనూ ఘట్టిగా అరిచినంత మాత్రాన చెయ్యరు. సమ్మెతో తలప్రాణం తోకకివస్తుంది. భార్యాబిడ్డలకి తిండి లేక, రెండుమూడు నెలలు మాడి మొక్కటికించెపి హీనపరిస్థితిలో పనిలో తిరిగి కుదురుకుంటాం. ఈ పోరాటాల్లో నాకు విశ్వాసం లేదు" అనేవాడు నాన్న విశ్వాసరాహిత్య యుగంలో.

మాపచ్చటి లోయలో నాగరికతా చిహ్నాలయినపోలీసు స్టేషనూ, మేజిస్ట్రేటుకోర్టూ, జైలూ వుండేవి కావు. గ్రిఫ్ అనే మతగురువు ప్రతి ఆదివారం క్రీస్తు బోధనలు చెప్తూ వుండే వాడు. గ్రిఫ్‌కి మా కుటుంబమంటేనే ఎంతో ఆపేక్ష. మా అక్కమీద అతనికి మనసు వుండేది. అది గ్రహించి ఒక నాడు బ్రాన్‌తో అన్నాను ఆసంగతి.

"మీ అక్క చపలచిత్త-ధనాన్ని పెళ్ళాడుతుంది. గ్రిఫ్‌ని చేసుకోదు. అతను యోగ్యుడు."

"గ్రిఫ్‌కూడా పెళ్ళి చేసుకుంటాడా?" అన్నాను వాదినతో ఆశ్చర్యంగా.

"ఏం అలా అడుగుతావు?"

"మతగురువులు పవిత్రమైనజీవితం గడపాలని క్రీస్తు ఆదేశంకదూ?"

"పెళ్ళి పాపపంకిలమని నీకెందుకు తోచింది?" వాడిన చిలిపి కళ్ళలో జీవనస్పర్థలోని అగాధసమస్య ప్రప్రథమంగా చూశాను.

బ్రౌన్ నా రెండు బుగ్గలూ నలపగా లవండరు పరిమళం నరనరాలకీ పట్టింది. ఆస్పర్శలో ముఖమల్ మెత్తదనం వుంది. బ్రౌన్ ఒకే దేవత; కాని, ఆ దేవత–ముగ్గురు పిల్లల తల్లి–అమాంతం ఒకరోజున భర్తృహీన అయింది. పెద్దన్న ప్రమాదవశాత్తూ చచ్చిపోయాడు. మనోవాక్కాయకర్మలలో నాన్నపక్షం అతనొక్కడే! మిగతా అందరూ వ్యతిరేకులే. నేను యింకా పొట్టి కుర్రవాణ్ణి. నన్ను పట్నంలోని ఇంగ్లీషుబళ్ళో (మేమువెల్ష్) జేర్పించారు.

అమ్మ పట్నవాసపు చదువులు అచ్చిరావని రాద్ధాంతం చేసింది. నాకు డాక్టరీయో, ప్లీడరీయో చెప్పించాలని నాన్న అభిలాష. మన చదువుమేస్టరి ముక్కు టొమాటోలా చెయ్యడంతో గుంటకట్టి గంట వాయించింది.

"ఏంచేస్తావురా యింక?" అన్నాడు నాన్న.

"నీకు మల్లే గనుల్లో చేర్తాను. నేనూ సంపాయిస్తాను" అన్నాను.

"శెభాష్" అంది అమ్మ, నా తెలివికి అభినందిస్తూ.

నాన్నమాత్రం పెదవివిరుస్తూ, 'సరే–నీఖర్మం' అన్నాడు.

నేనూ ఒక కార్మికుణ్ణే బొగ్గుగనుల చీకట్లో పనిచేసే కూలీని. Dignity of Labour ఇత్యాదులు ఆనాడు నాకు తెలీవు. నీరు పల్లానికి పారినట్లే పరిసరాలకీ అనుగుణ్యంగా జీవన స్రవంతికూడాను.

ఇద్దరు అన్నయ్యలూ అమెరికా వెళ్ళిపోయారు. మరిద్దరిలో ఒకడు న్యూజిలాండూ, మరొకడు బర్మాపోయారు. పెద్దన్న అకాలమరణం పొందాడు. అక్క లండన్‌లో రిజిస్టరీ పెళ్ళి చేసుకొని, మతగురువు గ్రిఫీ ఆశాజ్యోతిని అంధకారంలోకి గిరవాటు పెట్టింది. రేపో నేడో మా పచ్చటి లోయని వొదిలెయ్యపోతూ నలభై హేమంతాల గ్రిఫీ అన్నాడు: "ప్రపంచాన్నంతా సత్యంతో జయిద్దామనుకున్నాను. అలగ్జాండరు కొన్ని దేశాలే వశపరుచుకున్నాడు. కాని నేను మానవజాతి నంతటినీ సత్యంతో జయిద్దామని కలలు కన్నాను. ఆ పదంలో ఎంతో తేజస్సూ ఆకర్షణా వున్నాయి. చాలామంది చెవులలో 'సత్యం' అనేది సమ్మెట పోటు. ఆ వెలుగు చూసేవారు అరుదు. అయిపోయింది— మీ పచ్చటి లోయకూడా నాగరికతకోసం రెండుచేతులూ చాచింది. తొందరలోనే పోలీసుస్టేషనూ, మేస్త్రీటుకోర్టూ, జైలూ మీకక్కడా సంప్రాప్త మవుతాయి. క్రీస్తుని శిల వేసిన మానవజాతికి మోక్షం లేదు."

ఈసందేశంలోని అంతరార్థం ఏమిటని ఆరాత్రి బ్రౌన్‌ని అడిగాను. నేను బ్రౌన్‌గారి యింట్లోనే వుంటున్నాను—

అప్పటి కయిదారు నెలలనుంచీ, [illegible] పిల్లలకి సాయంగా వుండమని అమ్మ అక్కడ వుంచింది.

"పది పద్ధెనిమిదేళ్ళ వాడివి-నీకేమాత్రం తెలీదూ? భగ్నహృదయపు బాధా జ్వాల అది," అంది [illegible]. లవండరు వాసన ఘుమ్మ్మంటోంది కాని ఆమె కళ్ళలో చిలిపినవ్వు లేదు. 

మనసుచేసే పచార్లకి దారీతెన్నూ వుండదు. కార్మిక కల్లోలంలో విధాయకంగావచ్చే విప్లవం, మానాన్న ప్రాణాలు బలితీసుకోవడంతో, పచ్చటిలోయచరిత్ర నిశ్శేష మయింది. ఇది ఒట్టి స్మృతిమాల. ఒదిన కూతుర్ని రైలెక్కించి రాగానే తీగెముట్టుకుంటే డొంకకదిలినట్టు........



---